|| శ్రీహరిః || [ 665 ]

# ఆదర్శనారీ సుశీల



హిందీ మూలము

శ్రీ జయదయాల్ గోయన్దకా

అనువాదము

శ్రీ బులుసు ఉదయ భాస్కరం

పరిష్కర్త - సంపాదకుడు

శ్రీ సందెపూడి రామచంద్రరావు. ఎమ్.ఎ.,

ప్రచురణ

గీతా ప్రెస్ - గోరఖ్‌పూర్

1995

665 ] आ० ना० सु० ( तेलगू ) १ —

ప్రకాశకులు – గోవింద భవన్ కార్యాలయం,
గీతా ప్రెస్, గోరఖ్‌పూర్.



First Edition 1995 10,000 Copies

**Price : Rs. 3.00**

For Commercial Correspondance (Hindi or English only)
1. Gita Press - Gorakhpur PIN 273005,
2. Gopal Seva Trust
82 Krishna Talkies Road, ERODE PIN 638003.

పుస్తక ముద్రణ – గీతాప్రెస్, గోరఖ్‌పూర్,
ఫోను – 334721.

[ 665 ]

# నివేదన

ఆదర్శ ప్రాయమైన నరనారీ చరిత్రములు మానవులందరకు నత్యంత పఠనీయములు. వారి గాథలు మనకు మార్గ దర్శకులై సాంఘిక వర్తనమున, సాంసారిక జీవనమున సుఖ ప్రాయములు గాగలవు. పురాణ గ్రంథముల వర్ణింపబడిన స్త్రీ రత్నములే కాక ఎందరో నారీ రత్నములు నేటి కాలమున పేరుమోసిన వారున్నారు. అట్టి వారిలో మంచికి మారు పేరుగ ఆదర్శ మహిళ సుశీల ఒకరు. ఆమె గాథ పాఠకులకు పుస్తకరూపములో నంద జేయుటకే మాయీ ప్రయాస.

ఇట్లు
ప్రకాశకులు

|| శ్రీహరిః ||

# అమృతవచనములు

సమయము (కాలము) ఎంతయో అమూల్యమైనది. ప్రతి క్షణము, కాలము హరించి పోవుచున్నది. మానవ జన్మము అమూల్యమైనది. అశాశ్వతమైనది. అందుచే దీనిని, భజన, ధ్యానాదుల యందును, సజ్జన సాంగత్యమునందును నియోగించ వలెను. అమూల్యమైన ఈ సమయమును కేవలము ఉదర పోషణార్థ ము వ్యర్థపరచువాడు పశుప్రాయుడు.

ఈ కలియుగమునందు కేవలము హరినామస్మరణమును మించిన పరమ సాధనము వేరొకటి లేదు భగవన్నామము, ఏకాలమందైనను, ఏ కారణము చేతనైనను, ఎవరైనను, ఏ విధముగ జపించిన అయ్యది శుభప్రదమైనదియే అగును. ఎవరికే నామము (భగవానుని) నందభిమానమో ఆనామకీర్తనము జేయవచ్చును. ఏ పేరుతో పిలచినను, ఏనామము జపించినను, సరియే. భగవానునకు సర్వభాషలు భావములు విదితమే. నామమే దైనను పరమాత్మ ఒక్కడేయని జపించువాడు గ్రహించవలెను.

ఫలాసక్తి లేక చేయబడిన ఏ కర్మమైనను భగవానుని ధ్యానించి నటులే యగును. (ఇందు నామస్మరణము లేకున్నను. దీనిని తప్పుగ నెంచరాదు.) భజన ధ్యానములు ఎప్పుడు కష్టతరము లనిపించునో, వానియందు, విశ్వాసము తరిగినదని తెలియవలయును. వాస్తవమున భజన ధ్యానాదుల శ్రమతో గూడినవికావు.

శ్రీ జయదయాల్ గోయన్దకా

# సుశీల

## ఆదర్శనారీరత్నము

ఆత్మకల్యాణమును కోరుకొను మానవుడు తనలో దైవీసంపదను పెంపొందించుకొనవలెను అని భగవద్గీత తెలుపుచున్నది (16-5) కావున శుభములను పొందగోరు మనుజుడు దైవీసంపదతో తెలుపబడిన సద్గుణములను సదాచారములను అమృతతుల్యములైనవని యెఱిగి వానిని తనలో అవతరింపజేసుకొనుటకు ప్రయత్నము చేయవలెను. సద్గుణముల యొక్కయు. సదాచారముల యొక్కయు సారముగా భగవానుడు దైవీసంపదలకు సంబంధించిన 26 లక్షణములను విశేషముగా తెలిపియుండెను.

శ్లో. అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్
అహింసా సత్య మక్రోధః త్యాగ శ్శాంతి రపైశునమ్
దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్
తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత. (గీ 16/1-3)

1. భయము లేకుండుట. 2. అంతః కరణము పూర్తిగా నిర్మలముగా నుండుట. 3. తత్త్వజ్ఞానముకొఱకు నిరంతరముగా ధ్యానయోగమునందు నెలకొనియుండుట 4 సాత్త్విక దానము చేయుట 5. ఇంద్రియములను అదుపులో నుంచుకొనుట 6 భగవానుని, దేవతలను, గురుజనులను పూజించుట అగ్నిహోత్రాది విధులను ఆచరించుట 7 శాస్త్రములను పఠించుట, పఠింప జేయుట, భగవానుని నామగుణములను కీర్తించుచుండుట 8. స్వధర్మపాలన విషయమున ఎన్ని కష్టములు

ఎదురైనను భరించుట 9. ఇంద్రియములను, అంతఃకరణమును ప్రసన్నముగాను, నిర్మలముగాను ఉంచుకొనుట 10 మానసికముగాను, వాచికముగాను. శారీరకముగాను కూడా ఎవరికిని ఎట్టి కష్టమును కలిగింపకుండుట. 11. యథార్థముగాను ప్రియముగాను ఉండు మాటలు పలుకుచుండుట 12 తనకు అపకారము చేసినవానిమీద కూడ క్రోధమును ప్రకటింపకుండుట 13 స్వార్థ బుద్ధిని, నేను కర్తను అను అభిమానమును విడిచి ప్రతిపని చేయుచుండుట 14 చిత్త చాంచల్యము లేకుండుట. 15 ఎవరిని నిందింపకుండుట 16 సమస్తప్రాణులయందును దయ గలిగియుండుట 16 ఇంద్రియములు విషయములందు ప్రవర్తిల్లినను అందు ఆసక్తుడు కాకుండుట. 18 కోమల స్వభావము గలిగియుండుట 19 లోకవిరుద్ధముగా గాని శాస్త్రవిరుద్ధముగా గాని ఏపనినైన చేయుటకు సిగ్గుపడుట లేక వెనుకకు తగ్గుట 20 నిరర్థక పనులకు పాల్పడకుండుట 21 తేజోలక్షణము కలిగియుండుట 22 క్షమాగుణము కలిగి యుండుట 23 ధైర్యము కలిగియుండుట 24 బాహ్యాశుద్ధి కలిగియుండుట 25 ఎవరియందును శత్రుభావము వహింపకుండుట 26 తనను తాను పూజ్యునిగా భావించుకొని అహంకరింపకుండుట - అర్జునా! ఇవి దైవీసంపదకు సంబంధించిన లక్షణములు.

ప్రతీ స్త్రీయు, ప్రతి పురుషుడును దైవీసంపదకు సంబంధించిన యీ 26 లక్షణములను తమలో ధారణము చేయవలెను. వానిని ధరించు విధములను తెలుపుటకే క్రింద నొక కథను వ్రాయుచున్నాము.

పూర్వము ప్రయాగలో ఒక బ్రాహ్మణుడు ఉండెను. అతని పేరు దేవదత్తుడు. అతడు గొప్ప విద్వాంసుడు. సరళస్వభావము గలవాడు. సదాచార పరాయణుడు. భగవద్భక్తుడు. రాజ్యాధికారులు కూడా అతనిని విశేషముగా గౌరవించువారు. అతని భార్యపేరు గౌతమి.

ఆమె కూడ బహు సరళ స్వభావురాలు. మాయ మర్మములు ఎఱుగని సాధ్వీమణి. కాని ఆమె చదువుకొనలేదు. అక్షరజ్ఞానశూన్యురాలు. ఒకటి మొదలు నూరు వఱకు అంకెలను కూడ లెక్కపెట్టలేదు. ఆమెకు ముగ్గురు కొడుకులు, ఒక కుమార్తెయు ఉండిరి. వారిలో పెద్దవాడు సోమదత్తుడు. రెండవవాడు రామదత్తుడు. మూడవవాడు మోహన రావు. ఆ ముప్వురును చక్కని శిక్షణ పొందినవారు. సదాచారపరాయణులై చరించువారు, కొమరిత పేరు రోహిణి. వీరికి అందఱకును వివాహము లయ్యెను. చిన్న వయస్సునందే రోహిణికి పతివియోగము ప్రాప్తించెను. ఆమెకు సంతానము ఏదియును గలుగలేదు. ఆ కారణమున ఆమె పుట్టినింటనే నివసించుచుండెను. ఇక మగపిల్లలలో పెద్దవాని భార్య రామదేవి. రెండవవాని భార్య భగవానదేవి. మూడవవాని భార్య సుశీల. వీరిలో మొదటి యిరువురును చదువురాని వారు మూర్ఖత్వము గలవారు. కాని సుశీల మాత్రము అట్టిది కాదు. ఆమె బాగుగా చదువుకొన్నది. విద్యావంతురాలు. తన పేరునకు తగిన విధముగా సౌశీల్యము గలది. అంతియేకాదు, ఆమె బహు శాంతస్వభావురాలు సద్గుణవంతురాలు, భగవద్భక్తురాలు, సదాచారసంపద, పాతివ్రత్యనిష్ఠ యును గల సాధ్వీమతల్లి. అన్ని పనులయందును ఆమెకు చాతుర్యముండెను. కుట్టుపని ఎంబ్రాయిడరీ, వస్త్రములపై పువ్వులు, లతలు మున్నగు వానిని కుట్టుట చిన్న చడ్డీలు, బనియనులు, సంచులు తయారు చేయుట, అందమైన వ్రాత వ్రాయుట, బొమ్మలు వేయుట, శిల్పములను రచించుట మొదలగు అనేక కళలలో ఆమెకు చక్కని ప్రావీణ్యము ఉండెను. త్యాగము, సేవాభావము, కార్యకుశలత్వము మొదలగు గుణములు ఆమెయందు విశేషముగా భాసించుచుండెను. ఆమె కాపురమునకు వచ్చినది మొదలు వారి యింటిలో చక్కని వ్యవస్థమొదలయ్యెను. నిస్స్వార్థభావముతో సేవలు చేసి అనతికాలము నందే ఆమె యింటిలోనివారిని అందఱను ముగ్ధులను గావించి తనకు

అనుకూలముగా చేసుకొనెను. ఆమె అందఱితోడను ప్రేమపూర్వకముగా మెలగుచుండెడిది. పెద్దలను ఆదరించెడిది. చిన్నవారి యెడల స్నేహ భావమును, దయను ప్రదర్శించెడిది. సమానవయస్సువారగు స్త్రీలతో స్నేహభావము గలిగి మెలగుచుండెడిది. ఇంటిలోనివారు అందఱును ఆమె పనిపాటల వలన సత్స్వభావమువలన సంతోషమును పొందుచుం డిరి. వారి వాడలోని స్త్రీలు, పురుషులు, ఎల్లరును ఆమెయొక్క సుగుణసంపద చేత ప్రభావితులై ఆమెను విశేషముగా మెచ్చుకొను చుండిరి. ఆ సుశీల వయస్సులో చిన్నదైనను, అయింటిలో క్రొత్తగా కాపురము చేయవచ్చిన నవవధువైనను నాలుగు వంకల ఆమె పేరు విస్తరించిన కారణమున దూరదూరాలనుండి పలువురుస్త్రీలు ఏమైన నేర్చుకొనుటకును ఏమైన సలహాలు పొందుటకును ఆమె కడకు వచ్చుచుండిరి.

దేవదత్తపండితుడు ప్రతిదినము సంధ్యావందనము, గాయత్రీ మంత్రజపము, పూజాపఠనములు, భగవద్ధ్యానమును చేసుకొనుచుండు వాడు. అతడు ఉపదేశములు చేసియు, ఉపన్యాసప్రవచనాదులు చేసియు పౌరోహిత్యమును నిర్వహించియు కుటుంబపోషణము గావించుచుం డెను. అతని పెద్ద కుమారులు ఇరువురును నగరములో వ్యాపారము చేసి కొంత ధనము సంపాదించి తండ్రికి అర్పించుచుండిరి. చిన్నవాడగు మోహనలాలు కాలేజిలో చదువుకొనుచుండెను. గృహమునందు ప్రతిమాసము అన్నపానముల నిమిత్తముగా అగు వ్యయమును ఉద్దేశించి దేవదత్తుడు తన భార్యకు కొంత ద్రవ్యమును ఇచ్చుచుండువాడు. ఆద్రవ్యమును వినియోగించి ఆమె యింటిలోని వంటవానిచేత గాని, సేవకుని చేతకాని బజారునుండి అవశ్యకసామగ్రులను తెప్పించుకొను చుండెడిది. ఆమెయొక్క అమాయకత్వమును అవలంబముగా జేసుకొని అవంటవాడు, సేవకుడు ఇరువురును గూడి అవినీతికి, చౌర్యమునకును పాల్పడుచుండువారు. వారు ఒక వస్తువునకు ఎంత వెల చెప్పిన

అంత సొమ్మును అమె వారికి ఇచ్చివేయుచుండెను. ఆమె చెంతనున్న డబ్బును కూడ వారే లెక్క పెట్టు చుండువారు. ఏలయన్న ఆమెకు లెక్కపెట్టుట తెలియదు. సేవకుడు, వంటవాడును ఆమెదగ్గరనుండి ఎక్కువ డబ్బును కొనిపోయి తక్కువ సామగ్రిని తెచ్చి డబ్బు అంతయు చెల్లిపోయినదని చెప్పుచుండువారు. మఱియొకప్పుడు ఏమియు చెప్పక ఊరకుండువారు. వారు ఏమైన చెప్పినను గౌతమి అర్థము చేసుకొనలేకపోయెడిది.

బుద్ధిమంతురాలగు సుశీల అనతికాలమునందే ఆవంటవాడు, సేవకుడును కూడి ఆడుచున్న కపటనాటకమును గుర్తించెను. ఆమె తనలో అయ్యో! అత్త అమాయకురాలు, సరళస్వభావురాలును అగుట చేత వీరు ఇరువురును ఆమెను వంచించి ధనమును హరించుచున్నారు. ఇటుపైని అట్లు జరగకుండుటకు ఏదైన ఉపాయమును ఆలోచించి అనుసరించవలెను అని అనుకొనెను. కడకు ఒకనాడు ఆమె వంటవానిని పిలిచి ఓయీ! నీవుకాని, అతడు (సేవకుడు) కాని బజారునుండి గోధుమలు, బియ్యము, పప్పులు, కూరలు - నెయ్యి, నూనె, మిర్చి మొదలగు వస్తువులు ఏవి తెచ్చినను వానికి సరియైన పద్దును పాటించుచుండవలెను సుమా! అని వానితో చెప్పెను. అప్పుడు అతడు ఆమెను ధిక్కరించుచు ఏమమ్మా! ఇంత కాలమునకు నీవు మమ్ములను లెక్కలు అడుగవచ్చితివా? మేము ఉన్న చోట సర్వము విశ్వాసము మీదనే సాగిపోవుచుండును. మీ అత్త పెద్దవయస్సుగలయామె. ఆమె యెన్నడును మమ్ము ఏ లెక్కలును చెప్పుడని కోరలేదు. నిన్న మొన్న వచ్చినదానవు పెత్తనము మీద వైచుకొని యీనాడు మమ్ము లెక్కలు అడుగుచున్నావా? చాలును! చాలును! వెడలుమమ్మా! అని బదులు పలికెను. ఆ మాటలు ప్రక్క గదిలో కూర్చుండి యున్న దేవదత్తపండితుని చెవిలో పడెను. అప్పుడు అతడు

సహజముగనే ధైర్యముతో వంటవానిని సంబోధించి - నాయనా! కోడలు చెప్పిన మాట ఉచితమైనదే. ఆమెను తిరస్కరించుచు గద్దించి మాటలాడుట నీకు తగదు. నీవు పద్దును పాటింపక పోవుట, లెక్కలు చెప్పక పోవుట యుక్తము కాదు. డబ్బు విషయమున పైస పైసకు పరిగణనము ఉండవలెను. ఏది యేమైనను నీవు ఇటుపై అన్ని విషయములు కోడలితో చెప్పుచుండుము. ఆమె చదువుకొన్నది. లెక్కలు వ్రాసి ఉంచుకొనగలదు. అని వానిని హెచ్చరించెను. అనంతరము అతడు - అమ్మాయీ! నీ అత్త అమాయకురాలు ఇటుపయిని నీవే ఇంటి వ్యయమునకు సంబంధించిన విషయములను పద్దులు వ్రాసి దృష్టిలో ఉంచుకొను చుండుము! అని కోడలితో కూడ చెప్పెను. సుశీల కూడ అట్లు జరుగవలె ననియే కాంక్షించు చుండెను. అది మొదలు ఆమె ఇచ్చిపుచ్చుకొను విషయములలో పూర్తిగా లెక్కలు వ్రాసి ఉంచుకొనుట మొదలుపెట్టెను. వంటవాడు, సేవకుడును బజారునుండి ఎవరు ఏ సామగ్రి తెచ్చినను వారిని అడిగి పద్దు వ్రాయుచుండెను.

ఆమెయొక్క సేవ, స్వభావము, సద్గుణ సంపద కారణముగా ఇంటిలోని వారు అందఱు సంతుష్టాంతరంగులై యుండిరి. కాని స్వార్థపూరితుడైన వంటవాడు, సేవకుడును మాత్రము ఆమెను తమ మార్గమునందు కంటకముగా భావించి ద్వేషింప మొదలు పెట్టిరి. అనుక్షణమును వారు ఆమె విషయమున రంధ్రాన్వేషణము చేసి ఏమియో చెప్పి ఇంటిలోని ఇతరస్త్రీల మనసులను కలుషితము చేయ నారంభించిరి. అప్పుడప్పుడు ఇంటిలోనివారితో పాపము! ఇంత కాలమునకు మీకు కూడ పెద్ద దిక్కుగా సుశీలమ్మగారు వచ్చియున్నారు కదా! నిన్న మొన్న వచ్చి ఈనాడు ఆమె మీమీద కూడ పెత్తనము చేయ మొదలు పెట్టినారు కదా! అని ఎత్తిపొడుపు మాటలు ఆడు

చుండువారు. కాని వారి మాటలను కాదని ఇంటిలోని స్త్రీలు నాయనా! పాపము! సుశీల మీరు చెప్పుచున్న విధముగా కుటిలురాలుగాదు ఆమె మేము ఎట్లు చెప్పిన అట్లే చేయుచున్నది. ఆమె బహు ఉత్తమస్వభావురాలు. మీరు ఆమెను గూర్చి చెడుగా మాటలాడరాదు అని వారికి బదులు చెప్పుచుండువారు . అయినను వారు ఇపుడును సుశీల వెంట పడుట మానలేదు. అదను చూచి అప్పుడప్పుడు దోషారోపణము చేయుచు ఇంటిలోని వారికి ఆమెను గూర్చి చెడుగా ఏమేమో చెప్పుచునే యుండిరి. అయినను ఇంత జరుగుచున్నను సుశీల హృదయములో ఎట్టి వికారము, అశాంతియు (దైశీసంపద -14- చిత్త చాంచల్యము లేమి) ఉదయింపలేదు. ఎల్లవేళల ఆమె ప్రసన్న చిత్తురాలుగానే చరించుచుండెను. అయిననేమి? ఇంటిలోని వారు దూరదృష్టిలేనివారు. ఆ కారణమున వంటవాడు, సేవకుడును చెప్పుచున్నమాటలు వినగా వినగా వారి మనస్సులలో వికారము మొదలయ్యెను. ఆ మాటలు సత్యములు అని నమ్మి ఆస్త్రీలు ఇంటిలోని తమ మగలకు కూడ వివేకి సుశీలకు విరుద్ధముగా ఏవేవో మాటలు చెప్పిపెట్టుట మొదలుపెట్టిరి కాని సుశీల యొక్క సుగుణ సంపదచేత ప్రభావితులై యున్న కారణమున వారు ఆ మాటలను నమ్మకుండిరి.

కొంత కాలము గడచిన మీదట సుశీలకు ఒక మాడుబిడ్డ కలిగెను. ఆమెకు ఇంద్రసేని యని పేరు పెట్టబడెను. మఱి రెండు ఏండ్లు గడచిన మీదట ఒక కుమారుడు కలిగెను. వానికి దేవదత్త పండితుడు ఇంద్రసేనుడు అని నామకరణము గావించెను. ఈ పిల్లవాడు జన్మించిన పిదప కొన్ని దినములకు సోమదత్తుడు మొదలగువారు ఒకనాడు బంధుమిత్రులను అనేకులను రావించి వారికి మిఠాయి, బీడి, సిగరెట్టు మున్నగు బజారు వస్తువులను అర్పించి విందు చేసిరి. అనంతరము వారు పేకాట యాడుచు పరిహాసము చేసుకొనుచు కోలాహలము గావింప మొదలు పెట్టిరి. అది యంతయు చూచి

సుశీల ఈ విందునకు కోలాహలమునకు కారణము ఏమని ప్రశ్నించెను. ఇది యిచ్చటి పరిపాటి. పిల్లవాని అభివృద్ధిని గోరి యీ ఉత్సవము జరుపబడుచున్నది. అని వారు బదులు చెప్పిరి. అప్పుడు సుశీల సవినయముగా చేతులు జోడించి వారితో ఇట్లు చెప్పెను. ఈ విధమైన ఉత్సవమువలన ప్రయోజనము ఏదియును లేదు. దీనివలన సంస్కారములు ప్రబలును. నిరర్థకపు వ్యయము సంభవించును. ఈ కోలాహలమువలన నిద్రాభంగము కలుగును. కాబట్టి యీ పరిపాటి మేలైనది కాదు. మా పుట్టినింట మంచి పరిపాటి యున్నది. అక్కడ పిల్లలకు నామకరణ సంస్కారము అయిన పిమ్మట వేదపఠనము, భగవద్గీతాపారాయణము, కథాప్రవచనము, భగవన్నామ సంకీర్తనము మొదలగు కార్యక్రమములు జరుపబడు చుండును. అందువలన అందఱకును మంచి శిక్షణము లభించును. కాబట్టి యీ ప్రమాదకరములైన కార్యక్రమములను నిలిపివేయుడని మిమ్ము వేడుచున్నాను. సుశీల యాడిన యీ మాటల చేత ప్రభావితులై యింటిలోనివారు ఆ కార్యక్రమములను నిలిపివేసిరి. ఆమె సూచించిన కార్యక్రమమునకు తగిన వ్యవస్థ గావించిరి.

ఇంటిలో మఱియొక చంటిపిల్లవాడు ఎవడును లేని కారణమున గౌతమి సుశీల కొడుకును ఎక్కువగా ముద్దు చేయుచుండెను. ఆ పిల్లవాని చేతులకు కాళ్లకు నల్లని దారములను కట్టెను. వాని మెడలో జాలరువలె ఉండు పూసలదండను అలంకరించెను. ఆదండలో పులిగోరు, లక్క, ఇనుపరింగు, తాయెత్తు, ఇతరములగు పూసలగుత్తులును కూర్పబడియుండెను. కొన్ని దినములు గడచిన మీదట చూడగా ఆ దారపు కట్ల మూలమున ఆపిల్లవాని కాలుసేతులందును, పూసలదండవలన వక్షస్థలము మీదను నొక్కులుపడి ఆనవాళ్ళు ఏర్పడిపోయెను. అది చూచిసుశీల అత్తయ్యా! పిల్లవాని కాళ్లకు, చేతులకును ఈ దారములు ఎందులకు కట్టితిరి? ఇట్లు కట్టుటవలన

పిల్లవాని శరీరపు పెరుగుదలకు అవరోధము గలుగును. కాలుసేతులు సన్నగించి బలహీనములు అగును. వీని మూలమున బిడ్డ శరీరముపై ఆనవాళ్లు ఎట్లు పడినవో చూచితిరా? ఈ జాలరు యొక్క ఒత్తిడి చేత గుండెలపై గుంటవలె ఏర్పడినవి. రాత్రి పండుకొన్నవేళ ఇది వీని శరీరముమీద గ్రుచ్చుకొని గుంటలు, నొక్కులును ఏర్పడు చున్నవి. ఇట్టివి కట్టుటవలన ప్రయోజనము ఏమి? అని అత్తను ప్రశ్నించెను.
అప్పుడు గౌతమి: డాకిని, శాకిని మొదలైన దుష్టగ్రహాలవలన పీడలు, పూతన మొదలైన క్షుద్రశక్తుల పాపదృష్టి పీడలు కలుగకుండుటకు పిల్లవాని క్షేమము రక్షణను కోరి ఇట్టివి కట్టు చుందు రమ్మా!
సుశీల మఱి మీరు ఇంద్రసేనికి ఇట్టివి ఏవియు కట్టలేదు గదా!
గౌతమి - ఆడు బిడ్డలను భగవానుడే రక్షించును. వారికి అట్టివి కట్ట నక్కఱలేదమ్మా
అప్పుడు సుశీల రెండు చేతులు జోడించి ఎంతో వినయముగా అత్తతో ఇట్లు అనెను. అత్తయ్యా! భగవానుడు ఒక్క ఆడు బిడ్డలనే కాదు. అందఱను రక్షించును. ఇంద్రసేనిని రక్షించిన భగవానుడు ఈ ఇంద్రసేనుని రక్షింపకుండునా? అమ్మా! కావున మనము పిల్లల రక్షణ విషయమున ఏమియు చింతింప నక్కఱలేదు. ఈ పనులవలన మనకు భగవానునిమీద విశ్వాసము కాదు. ఎంతయో అవిశ్వాసము ఉన్నట్లు వ్యక్తమగుచుండును. కాబట్టి వీనివలన ప్రయోజన ఏదియు లేదమ్మా!
సుశీల యాడిన యీ మాటలు గౌతమికి యుక్తియుక్తములైనవిగా తోచెను. తోడనే ఆమె పిల్ల వాని మెడలోని జాలరును పోలిన పూసల దండను. కాలుసేతులందు కట్టిన దారములను తీసి దూర ముగా పాఱవైచెను.

కొన్ని దినములు గడచిన మీదట హరిద్వారములో ‘కుంభమేలా’ (గంగాపుష్కర సంబంధమగు తీర్థము లేక ఉత్సవము) మొదలయ్యెను. కొడుకులు అందఱును గూడి తమ తండ్రి చెంతకు పోయి - నాన్నగారూ, మేము ఎల్లరమును కుంభమేలాకు అరుగవలెనని ఉత్కంఠపడు చున్నాము వెడలుటకు మాకు అనుమతి నీయరా? అని అతనిని కోరిరి - మంచిది! మంచిది! వెడలుదము. వెడలుదము. నేనును వచ్చెదను అని దేవదత్తపండితుడు తన ఆమోదమును తెలిపెను. ఇక విలంబము ఏముండును? వెంటనే ప్రయాణసన్నాహము మొదలయ్యెను. గృహ సంరక్షణమునకు తగిన వ్యవస్థ చేసుకొని సకుటుంబముగా వారు అందఱును పయనమైరి. అప్పుడు సుశీల తీర్థములో మోసకాండ్రు, చోరులు, తార్పుడుకత్తెలు, దోపిడి దొంగలు బహుళముగా ఉందురు. వారి విషయమున బహు జాగరూకతను పాటించుడు! అపరిచితులైన యేస్త్రీ పురుషులతోడను ఎట్టి సంబంధమును పెట్టుకొనవలదు. ఎవరైన ఏ వస్తువైన ఇచ్చిన పుచ్చుకొనవలదు. అపరిచిత పురుషుని ఎవ్వరిని విశ్వసింపవలదు. ప్రయాణమధ్యమున ఆహారపానీయ ముల విషయమున నిగ్రహము (అదుపు)ను పాటించుడు! ఏపని చేసినను ధైర్యముతోను, వివేకపూర్వకముగాను చేయుడు! ఎవని ముందు అసమర్థతను, పిరికితనమును ప్రకటించకుడు! సర్వత్ర ధైర్యముతోను, ఉత్సాహముతోను, సాహసపూర్వకముగాను కార్యసాధనము చేయుడు! అని ప్రార్థనాపూర్వకముగా వారిని హెచ్చరించెను.

మార్గములో వారు ముందుగా అయోధ్యలో దిగి సరయూ స్నానము, దేవదర్శనము చేయ సంకల్పించుకొనిరి. వారు అక్కడకు పోయి ఒక సత్రములోబస చేసిరి. ఎల్లరును సరయూస్నానము చేసిరి. అచ్చటి వివిధమందిరములకు అరిగి దైవదర్శనము చేసుకొనిరి. అనంతరము తమ బసకు మఱలి వచ్చిరి. అప్పుడు వంటవాడు

సత్రము బయట అరుగుమీద కూర్చుండి యుండెను. ఆ సమయమున ఒక మోసకాడు వచ్చి - నేను నీకో మసాలా ద్రవ్యమును ఇచ్చుచున్నాను. దీనిని పప్పులో వేసి వండినచో పప్పు ఎంతయో స్వాదిష్టమైనదిగాను, మేలైనదిగాను సిద్ధము గాగలదు. దానిని తిన్నవారు సంతోషించి నీకు వశీభూతులు కాగలరు. అని చెప్పుచు ఒక కాగితపు పొట్లమును అతని చేతిలో ఉంచెను. ఆ వంటవాడు మూర్ఖుడు. అతడు వంటచేయునప్పుడు ఆ పొట్లములోని పదార్థమును కొంత పప్పులో వేసి మిగిలినదానిని మఱల పొట్లము కట్టి ఒకచోట ఉంచెను. వంట సిద్ధమైన పిమ్మట సోమదత్తుడు, రామదత్తుడు, ఇంద్రసేని, ఇంద్రసేనుడును రోహిణియు భోజనములు చేసిరి. చేసిన మీదట కొన్ని క్షణములలోనే వారు అందఱును ఒడలు ఎఱుగక నేలమీద వాలిపోయిరి. ఆ పరిస్థితిని చూచి సుశీల భోజనపదార్థములలో తప్పక ఏదో దోషము చేరియుండును. కాకున్న వీరు అందఱును ఇట్లు ఏల వాలిపోవుదురు ? అని అనుమానించెను.

ఆమె వెంటనే వంట యింటిలోనికి పోయి చూడగా అక్కడ ఆమెకు ఒక కాగితపు పొట్లములో ఉమ్మెత్తగింజలు కానవచ్చెను. ఏమయ్యా! రణనాడు నీవు వీరికి ఏమి తినిపించితివయ్యా! తిన్నవారందఱు ఒడలెఱుగక పడిపోయిరి. అని ఆమె వంటవానిని అడిగెను. ఏమియును లేదు అని అతడు బదులు చెప్పెను. ఏమియు లేకున్న వీరందఱు ఎందులకు నేలమీద వాలిపోయిరి ? నిజము చెప్పు! లేకున్న నీ మీద చట్టము ప్రకారము చర్యతీసికొనుట సంభవించును అని ఆమె మఱల వంటవానిని నిలువరించెను. తన చేతిలోని ఉమ్మెత్త గింజలను చూపుచు ఇవి యిచ్చటకు ఎట్లు వచ్చినవి ? అని వానిని ప్రశ్నించెను.

అమ్మా! నేను బయట కూర్చుండి యుండగా ఎవడో ఒక సజ్జనుడు వచ్చెను. అతడు నాకు రు 20/-లు దానము చేసెను.

అతడే నాకు ఈ పొట్లమును ఇచ్చినాడు. ఇందు మసాలాద్రవ్యము ఏదో ఉన్నదని, దానిని ఉడుకుచున్న పప్పులో వేసిన ఆ పప్పు బహుస్వాదిష్టముగా సిద్ధమగునని, దానిని తిన్నవారు ఎంతో సంతోషింతురని నాతో చెప్పినాడు. నేను పొట్లములో ఏమున్నదో పరికింపలేదు. అందలి పదార్థమును కొంత పప్పులో వేసి మిగిలిన దానిని పొట్లము కట్టి ఉంచితిని అని అతడు బదులు చెప్పెను.

తోడనే సుశీల ఆ విషయములను తన పతికి తెలియజెప్పి సత్వరముగా తగిన ఉపచారములు జరిపింపగోరెను. ఈ విషయమును మోహనలాలు తండ్రితో చెప్పెను. అది విని దేవదత్తుడు ఎంతయో ఖేదమును, ఆశ్చర్యమును పొందెను. అతడు చికిత్స చేయుటకు వెంటనే వైద్యులను రావించెను. వంటవానిని పిలిచి ఓయీ! నీవు మమ్ము అందఱను చంపివేయ సంకల్పించితివా ఏమి? నిన్ను పోలీసులకు అప్పగించెదను అని గద్దించి కఠినవచనములాడి మందలించెను. అప్పుడు అతడు తనను క్షమింప వేడుకొనెను. దేవదత్తపండితుడు వానిని క్షమించుచు భవిష్యత్తులో ఇట్టి పని యెన్నడును చేయకుము! అని వానిని హెచ్చరించెను. అంతలో వైద్యులు పడిపోయినవారికి తగిన చికిత్స గావించిరి. సమయము మీఱక ముందు తగిన చికిత్స అందుట వలన పడిపోయినవారు అందఱు మఱల బ్రతికి బట్ట గట్టిరి. వారు అందఱు సుశీలను ఎంతయో మెచ్చుకొనిరి.

మఱునటి దినమున వారు అందఱు అటనుండి కదలి ముందు దెసకు పయనము సాగించిరి. వారి బండి క్రమముగా జ్వాలాపూరు చేరెను. అప్పుడు పిల్లలు దాహము! దాహమని గొడవ చేసిరి. వారికి మంచినీరు ఇప్పించుటకై వారితోడ సుశీల బండి దిగెను. ఆమె మఱలి వచ్చునంతలో బండి కదలిపోయెను. ఆమె స్టేషనులో నిలిచిపోయెను. ఇంటివారు బండిలో (రైలు) అలారపు గొలుసును లాగిరి. అయినను అందలి అలారము పని చేయని కారణమున

బండి నిలువలేదు. మిగిలిన వారితోడ దేవదత్తుడు హరిద్వారము చేరెను. పట్టణములో నిలుచుటకు వారికి ఎందును తావు దొరకలేదు. ఆ కారణమున వారు గంగాతీరమునకు చేరి అక్కడ గుడారము వైచుకొని అందు నిలిచిరి. కాని పిల్లలతోడ సుశీల తమనుండి విడిపోయిన కారణమున వారికి మనశ్శాంతి లేకపోయెను. వారు ఆమెను అన్వేషింప మొదలుపెట్టిరి.

అక్కడ సుశీల ఆరాటము చెందలేదు. ఆమె ధైర్యముగా పిల్లలను ఎత్తుకొని జ్వాలాపూరు నుండి కాలినడకను హరిద్వారము చేరెను. అక్కడ ఒక దేవాలయములో నిలిచెను. అచ్చటి అర్చకస్వామి విద్యావంతుడు. ఆమె తన ఉదంతము అంతయు సంస్కృతభాషలో అతనికి తెలియజేసెను. ఆమెయొక్క పాండిత్యము చేత అతడు ప్రభావితుడై ఆమెకు అక్కడ ఉండుటకు స్థానము కల్పించెను. అప్పుడు ఆమె ఎన్నో కాగితములను తెప్పించెను. వానిమీద తాను జ్వాలాపూరునుండి నడచి వచ్చి హరిద్వారము చేరి ఫలానా దేవాలయములో ఉన్నాను అను వివరము వ్రాసి అర్చక స్వామి సహకారముతో స్వయంసేవకుల ద్వారా (స్కౌట్సు) నగరములోని ముఖ్య ప్రదేశములందు; కూడలు లందును అంటింపజేయించెను. తన విషయమును పోలీసుస్టేషనులో కూడ సూచింపజేసెను. అంతట ఈ సమాచారము అన్ని దిక్కులయందును వ్యాపించిపోయెను. ఇంటివారు అన్వేషణ చేయుచునే యుండిరి. అందందు అంటింపబడిన ప్రకటన పత్రముల మూలమున వారికి ఆమెయొక్క ఉనికి తెలిసిపోయెను. వారు ఆలయమునకు వచ్చి సుశీలను కలిసికొనిరి. ఆమె ప్రదర్శించిన యీ అద్భుతమైన కార్యకుశలత్వమును, ధైర్యమును చూచి వారు పరమానందమును పొందిరి.

వారికి అక్కడ విశేష జన సమ్మర్దము కారణముగా స్వచ్ఛమైన

పాలు లభించలేదు. ఆ కారణమున వారు రు. 200/-లకు ఒక ఆవును కొని తెచ్చుకొనిరి వారికి అక్కడ సుఖముగా నివాసము సాగుచుండెను. రాత్రులందు వారు వంతులవారిగా మేల్కొనియుండి తమను, తమ గుడారమును రక్షించుకొనుచుండిరి. ఇట్లు ఉండగా ఒకనాటి రాత్రి మేల్కొని యుండవలసిన వంతు సుశీలకు వచ్చెను. నాటి రాత్రి 4 గంటల వేళ ఒక దొంగ వచ్చి వీరి ఆవును విప్పి తోలుకొనిపోవ సాగెను. సుశీల చక్కని దూరదృష్టి గలది. ఆమె ముందుగానే ఒక గంటను తెప్పించి గుడారములోపల ఉంచెను. ఎవరైన దొంగలు వచ్చినను, ఏదైన ఆపద యెదురైనను గణగణ గంట మ్రోగించెదను అని ఆమె తన వారితో ముందుగనే చెప్పియుండెను. కారణము ఏమన బిగ్గఱగా అరచుటకు ఆమెకు సిగ్గు అగును. విషయము తన వారికి తెలుపకున్న ఆపద తొలగదు. దొంగ సొత్తును హరించి కొనిపోవును. ఆ కారణముగనే ఆమె బాగుగా ఆలోచించి ముందుగానే గంటను తెప్పించి యుంచెను. ఆమె ఆవును కొనిపోవుచున్న దొంగను చూచెను. వెంటనే గణగణ గంట మ్రోగింప మొదలుపెట్టెను. తోడనే అందఱు మేల్కొనిరి. ఒక్కుమ్మడి అందఱును ఏమిటి? ఏమిటి? అని కోలాహలము గావించిరి. అంతలో దొంగ పాఱిపోయెను. కోడలి దూరదృష్టిని చూచి అందఱును సంతోషమును పొందిరి.

కుంభ సంక్రమణపర్వమునాడు వారు అందఱు 'హరిక్పైడీ' అను పవిత్ర ప్రదేశమునందు స్నానము చేయుటకు వెడలిరి. ఆనాడు జన సమ్మర్దము అత్యధికముగా ఉన్నకారణమున కొందఱు యాత్రికులు త్రొక్కిసలాటలో చిక్కినలిగి చనిపోయిరి. కాని బుద్ధిమంతురాలు అగు సుశీల తన వారిని అందఱును బహు చాకచక్యముతో సమ్మర్దములో చిక్కుకొనని విధముగా వెలికి రప్పించుచు మార్గమునకు ప్రక్క ప్రక్కగా

నడిపించి ఘట్టము దగ్గఱకు కొనిపోయెను. కడకు అందఱు గంగలో స్నానములు ఆచరించి సురక్షితముగా తమ బసకు చేరిరి. అనంతరము ఒకటి రెండు దినములు అక్కడ గడపి వారు అందఱును మఱల తమ స్వస్థానమగు ప్రయాగకు తిరిగి వచ్చి యథాపూర్వముగా సానందముగా సమయము బుచ్చసాగిరి.

(3)

అది గ్రీష్మకాలము. పున్నమినాటి రాత్రి. సుశీల తన యింటి డాబామీద తిరుగాడుచుండెను. ఆ సమయమున సుశీల యింటిని చేరియున్న పొరుగింటియామె కూడ తన యింటిడాబా మీదకు వచ్చెను. ఆమె వైధవ్యమును పొందిన బ్రాహ్మణస్త్రీ. సంపన్నకుటుంబమునకు చెందినది ఆమె. ఆమెకు ఇద్దరు కొడుకులు ఉండిరి. ఒకడు 16 ఏండ్లవాడు రెండవవాడు 3 ఏండ్లవాడు. ఇరువురి డాబాలు సమానముగాను చేరువగాను ఉన్న కారణమున సుశీల ఆ పొరుగింటి యామెకు దగ్గఱగా పోయి నమస్కారము చేసెను. ఆ పొరుగింటి యామె బహు కర్కశస్వభావురాలు. ఆమెకు నోటి దురుసుతనము ఎక్కువ. వెంటనే ఆమె - ఏమే! నాల్గు అక్షరపు ముక్కలు చదువుకొని కన్ను మిన్ను కానకుండ చరించుచున్నావు. గర్వముతో నీకు కన్నులు మూసుకొని పోయినవి కదే! నీ ప్రవర్తన నాకు చాల కోపమును గలిగించుచున్నదే! అని సుశీలను పరుషవచనములు ఆడెను. లేదండీ! నేను మిమ్ము మా అమ్మవంటివారని. అత్తవంటివారని భావించి మీకు నమస్కారము చేసితిని అని సుశీల ఆమెకు బదులు చెప్పెను. అప్పుడు ఆమె మఱల ఏమిటి? ఏమిటి? నేను నీకు అమ్మనా? అనగా నీ తండ్రికి పెండ్లామును అన్నమాట! ఏమేమి! నీకు అత్తనా? అనగా నీ మామకు పెండ్లామును అన్నమాట! ఇదిగో! చూడు!

తలచుకొన్నచో నేను ఆ యిరువురి గడ్డాలను కాల్చివేయగలను! ఏమనుకొన్నావో? అని సుశీలను తూలనాడెను. అంతటితో ఊరకుండక ఇంకను ఏవో పరుషవచనములాడుచు క్రిందకు దిగి తనయింటి బయట రోడ్డుమీదకు వచ్చి గోల చేయ మొదలుపెట్టెను. ఆమె అరపులు విని యిరుగుపొరుగులవారు అందఱు అక్కడ ప్రోగుపడిరి. ఆమె వారితో - చూచితిరా? చూచితిరా? ఈ పిల్ల పొగరు చూచితిరా? ఈమె నన్ను తన తండ్రికి, మామకు భార్యను చేయ యత్నించుచున్నది అని మొఱపెట్ట మొదలుపెట్టెను.

ఆమె తిట్టుచున్న తిట్లను పరుషవచనములను విని సుశీల హితమును కోరువారు కొందఱు ఆమెకడకు వచ్చి - అమ్మా! నీవు నీ భర్తతో చెప్పి యీామె మీద కేసు పెట్టించుమమ్మా! భవిష్యత్తులో ఇట్టి పని మఱల చేయకుండునట్లు కోర్టువారు ఈమె చేత ప్రతిజ్ఞాపత్రము వ్రాయించి తీసుకొందురు. అట్లు చేసిననాడు ఎవరును ఎవరిని ఇటుపై అనుచితముగా తిట్టుటకు ప్రయత్నింపకుందురు అని ఆమెకు సలహాను ఇచ్చిరి. అప్పుడు సుశీల చేతులు జోడించుకొని ఎంతో వినయముతోను, ప్రేమతోను వారికి ఇట్లు నచ్చజెప్పెను. - పోలీసుల వఱకు వెడలుట మంచిది కాదు. అది పెద్ద మనుష్యులు చేయు పనికాదు. మీరు చూచుచు ఉండుడు! భగవంతుడు కలసి వచ్చినచో నేను ఆమెను ప్రేమతో నా పక్షమునకు తిరుగునట్లు చేసుకొనగలను. ఈ మాటలు విని వారు సుశీలయొక్క సరళ స్వభావమును, ద్రోహరాహిత్యమును, హితాకాంక్షను, ద్వేషము లేకపోవుటను (దైవీసంపద-25 నిర్వైరము) సచ్చరిత్రతను పరికించి ఎంతో సంతోషమును పొంది వెడలిపోయిరి.

ఇట్లుండగా ఒకనాడు నోటిదురుసుతనాల బోటియగు ఆ పొరుగింటి యామె కొడుకు 3 ఏండ్లవాడు రోడ్డుమీద ఆడుకొనుచుండెను. అంతలో రెండు ఆఁబోతులు కుమ్ములాడుకొనుచు ఆ పిల్లవానికి

మిక్కిలి చేరువగా వచ్చివైచెను. అది చూచి సుశీల పరుగిడిపోయి ఆ పిల్లవానిని ఎత్తుకొని ఈవలకు తీసుకొని వచ్చి పొరుగింటి యామె దగ్గఱకు పోయి - అమ్మా! ఒంటరిగా పిల్లవానిని రోడ్డుమీద విడిచిపెట్టకూడదు. రెండు ఆబోతులు పోరాడుచు పిల్లవాని మీదకు వచ్చుచుండగా చూచి తటాలున పరుగిడి పోయి వీనిని ఎత్తుకొని తీసుకొని వచ్చితిని. అని చెప్పుచు ఆమెకు అప్పగించెను. అప్పుడు ఆ వదరు మాటల శూర్పణఖ! - పోవే! పో! నీవు ఎందులకు తీసుకొని వచ్చితివి? నిన్ను ఎవరు తీసుకొని రమ్మన్నారు? నేనే తీసుకొని వచ్చుదానను గదా! అని సుశీలను ఈసడించెను. ప్రమాద పరిస్థితిని చూచితిని. కనుక పరుగిడిపోయి తీసుకొని వచ్చితిని. ఇందు నాకు గలిగిన నష్టము ఏమి? అని పలికి సుశీల తన యింటికి మఱలివచ్చెను.

సుశీలయొక్క పుట్టినింటివారి యూరిలో ఒక ధనిక బ్రాహ్మణుడు ఉండెను. అతనికి సుశీలయందు గౌరవభావము ఎక్కువ. అతనికి 12 ఏండ్ల ప్రాయము గల కొమరిత ఒకర్తి యుండెను. ఆమెకు పెండ్లి చేయ సంకల్పించి అతడు వరాన్వేషణము చేయుచుండెను. సుశీల యొక్క అత్తవారింటి ప్రక్కనున్న విధవాస్త్రీకి 16 ఏండ్ల కొడుకు ఉన్నట్లు అతనికి తెలిసెను. వారి మంచి చెడ్డలను గూర్చి విచారణ చేయుటకై అతడు ఒక మనుష్యుని సుశీల దగ్గఱకు పంపెను. నగరములోని ఒక వ్యక్తి ఆ విధవాస్త్రీ దగ్గఱకు వచ్చి - అమ్మా! నీ కొడుకునకు తన కూతురును ఇచ్చు విషయమున మీ మంచి చెడ్డలను విచారించుటకై సుశీల పుట్టినింటి వారి యూరి నుండి ఒక బ్రాహ్మణుడు సుశీల కడకు వచ్చి యున్నాడని ఆమెకు ఎఱుగజెప్పెను. ఆ మాట విని ఆ కఠినాత్మురాలు ఉలికిపాటు చెందెను. ఆ సుశీల నాతో జగడమాడినది. ఆమెకు నేనన్న క్రిట్టదు. నాతోడ ఆమెకు శత్రుత్వము ఉన్నదే! అని కూడ పలికెను. అనంతరము ఆమె

సుశీల యింటి ద్వారము చేరువకు చేరి ప్రక్కగా పొంచి యుండి గుప్తముగా లోపల సుశీలయు, వచ్చిన బ్రాహ్మణుడును మాటలాడుకొనుచున్న మాటలను ఆలకింప మొదలుపెట్టెను.

లోపల నున్న బ్రాహ్మణుడు - అమ్మాయీ! నీ యన్న యొక్క మిత్రుడు తనకు నీమీద ఉన్న విశ్వాసమును అనుసరించి నన్ను నీకడకు అంపినాడు. మీయింటి ప్రక్కన ఉన్న యింటిలో ఒక విధవాస్త్రీ యున్నది కదా! ఆమెకు 16 ఏండ్లవాడగు కొడుకు ఒకడు ఉన్నాడు గదా!వానికి పిల్లనిచ్చి బంధుత్వము కలుపుకొను విషయమున నీ యభిప్రాయము ఏమి? అని సుశీలను ప్రశ్నించెను. సుశీల వారి వీరి విషయములను బాగుగా ఎఱిగియున్నది. ఇరుపక్షముల వారును ధనవంతులే! ఇరుపక్షముల వారి స్త్రీలును కర్కశస్వభావము గలవారే! అని ఆమె తనలో ఆలోచించుకొనెను. అనంతరము ఆమె యా బ్రాహ్మణునితో వారికి ఈ సంబంధము మేలైనదే అని యెఱుగజెప్పెను. పిల్లవాని తల్లి నోటి దురుసుతనము ఉన్న వ్యక్తి యని అందఱును చెప్పుచున్నారమ్మా! అని యా బ్రాహ్మణుడు సుశీలతో అనెను. ఈ కాలములో ఆడవారిలో తెలివి తక్కువతనము పాలు ఎక్కువగా ఉండుటచేత ఇంచుమించుగా అందఱి యిండ్లయందును రాగద్వేషములు, కలహములును కలుగుచుండుట పరిపాటియైనది. (అకారణమున ఒకరిని ఒకరు నిందించుకొనునట్టి పరిస్థితులు తలయెత్తుట సహజమైనది) కాబట్టి యీ విషయమును దృష్టిలో ఉంచుకొని మనము వెనుకంజ వేయ నక్కఱలేదు. నా యభిప్రాయమును అనుసరించి యీ సంబంధమును కలుపుకొనుట వారికి ఎంతయో శుభకరమైనది అని సుశీల అతనికి బదులు చెప్పెను. అంతట ఆ బ్రాహ్మణుడు తృప్తి చెంది అటనుండి కదలి వెడలిపోయెను.

కర్కశురాలైన ఆ విధవాస్త్రీ వారి సంభాషణమును ఆమూలాగ్రముగా ఆలకించెను. విన్న మీదట సుశీలయొక్క సత్ప్రవర్తనము ఆమెపై మంచి ప్రభావమును (దైవీ సంపద-21తేజము) చూపెను. ఆమె గృహములోపల ఉన్న సుశీల దగ్గఱకు పోయి సవినయముగా ఆమెతో ఇట్లనెను- అమ్మా! సుశీలా! నీవు ధన్యురాలవు తల్లీ! నేను నీ తోడ బహు కర్కశముగా వ్యవహరించితిని. అయినను నీవు నాకు మేలునే చేయుటకు యత్నించితివి. సోదరీ! నీ యీ సద్వ్యవహారమును చూడగా నాకు పరమానందమైనది. తల్లీ! నీవు ఈ విద్యను ఎవరి దగ్గఱ నేర్చుకొన్నావు? నాకు కూడ నీకు వలె సాధుస్వభావము ప్రాప్తించగలదా? నేను నీ తోడ చెలిమిని గోరుచున్నాను. అప్పుడప్పుడు నేను మీ యింటికి నీ దగ్గఱకు రావచ్చునా? అనగా విని సుశీల - ఎందుకు రాకూడదమ్మా? తప్పక వచ్చుచుండుడు! ఈ యింటిని మీ యిల్లే అనుకొనుడు! మీ రాకను నేను నా సౌభాగ్యముగా భావించుకొందును. మీకు నాయందు ఎంతో దయ, ప్రేమ ఉన్నందులకు నాకు చాల సంతోషముగా ఉన్నది. అని సాదరముగా బదులు చెప్పెను. సుశీల మాటలు విని ఆ బ్రాహ్మణి ఎంతో ప్రసన్నతను పొందెను. అప్పుడప్పుడు ఆమె సుశీల యింటికి వచ్చుట మొదలు పెట్టెను. క్రమముగా అనతికాలములనందే ఆమె సుశీల వలె సాధుస్వభావము గలదిగా పరిణతురాలు అయ్యెను.

పొరుగింటి కఠినాత్మురాలియందు అసాధారణ పరివర్తనమును

గాంచి అంతకు ముందు సుశీల హితమును కోరి పోలీసు కేసు పెట్టుమని ఆమెకు సలహా ఇచ్చిన ఆమె హితైషులు అందఱును ప్రభావితులై పరమాశ్చర్యమును పొందిరి. వారు సుశీల దగ్గఱకు వచ్చి - సుశీలా! అద్భుతము! నీవు ఈ కఠినాత్మురాలిని నీవలె పరమసాధు స్వభావురాలిని చేసివైచితివి అని ఆమెను ప్రశంసించిరి. ఇది యంతయు ఆ భగవానుని దయ అన్నది ఆమె. నీవు ధన్యురాలవమ్మా! పోలీసు కేసు పెట్టుమని నీకు మేము సలహా ఇచ్చుట మా తప్పు. అని వారు మఱల బదులు పలికిరి.

అటు పిమ్మట కొన్ని దినములలోనే ఆ పొరుగింటి యామె కొడుకునకు వివాహము నిశ్చితమయ్యెను. అప్పుడు ఆమె సుశీల యింటిలోని పురుషుల ను అందఱను కోరి కోరి పెండ్లికి తోడ్కొని పోయెను. ఇంటిలోని పురుషులు అందఱు మూడు దినముల కాలము పెండ్లిలో పాల్గొనబోయిరి. ఈ మధ్య సమయములో సుశీల నివసించుచున్న వాడలో ఒక కోమటి యింటిలో దొంగతనము జరిగెను. ఆ కోమటిని వెంటబెట్టుకొని ఒక పోలీసు ఆఫీసరు సుశీల యింటిలోపలకు చొచ్చుకొని వచ్చి మీ యిల్లు సోదా చేయవలసి యున్నది అని పలికెను. ఆ మాట విని యింటిలోని యాడువారు అందఱు భయపడిపోయిరి. అప్పుడు గౌతమి అమ్మాయీ! పోలీసులు వచ్చినారు. వారి రాక మంచిది కాదు. కొన్ని రూపాయలు వారి చేతిలో పెట్టి వారిని పంపించివేయు మమ్మా! అని సుశీలతో చెప్పెను. అంతలో సుశీల ముందునకు వచ్చి - మీరు చింతింపకుడు! ఈ వ్యవహారమును నేను చక్కజేసెదను అని తన వారికి ధైర్యము చెప్పి. ఆ కోమటితో - ఏమయ్యా! మా మగవారు ఇంట లేని సమయమున

వచ్చి మాయింటిని సోదా చేసి మమ్ము అవమానింపనెంచితిరా? మీ యింటిలో పోయిన వస్తువులు మా యింటిలో ఉన్నవని మీకు అనుమానము ఎట్లు కల్గినది? ఎందులకు కలిగినది? అని ప్రశ్నపూర్వకముగా పలికెను. అది కాదమ్మా! నేను అట్లు చేయదలచుకొనలేదు. నన్ను ఇక్కడకు ఈ పోలీసువారే తోడ్కొని వచ్చినారు అని అతడు బదులు చెప్పెను. అప్పుడు సుశీల నిర్భయముగా - అయ్యా! పోలీసువారూ! మీరు మా యింటిని సోదా చేయనెంచితిరా? అని ఆ యధికారిని ప్రశ్నించెను. నిన్న రాత్రి యీ కోమటి యింట దొంగతనము జరిగినది. ఆ కారణమున సోదా చేయుటకు వచ్చితిమి అని యా పోలీసు అధికారి బదులు చెప్పెను. మంచిది! మంచిది! అట్లయిన మేము స్వేచ్ఛాపూర్వకముగానే మీ యింటిని సోదా చేయుటకు వచ్చితిమి అని మీరు మాకు ఒక కాగితము వ్రాసి యిండు! అంతియే కాదు. సోదా చేసిన మీదట దొంగసొత్తు ఏదియు మీకు చిక్కకపోయిన దశలో ఈ విధముగా మమ్ము అవమానించినందులకు బదులుగా మేము పరువునష్టపు దావా ఎవరిమీద వేయవలెను? ఆ విషయమున బాధ్యత వహించువారు ఎవరు? అన్న విషయమును కూడ కాగితములో స్పష్టముగా సూచించుడు! అని సుశీల మఱల నిర్భయముగా (దైవీ సంపద 1 భయరాహిత్యము) హెచ్చరించెను. ఆ మాటలు విని ఆ యధికారి తడబాటు చెంది - అది కాదమ్మా! ఈ కోమటియే మమ్ము ఇక్కడకు తీసుకొని వచ్చి యిప్పుడు కాదనుచున్నాడమ్మా! అని మాట మార్చి తన వెంట నున్నవారిని అందఱను తోడ్కొని వెడలిపోయెను. అనంతరము పెండ్లికి వెడలిన మగవారు మఱలి వచ్చిరి. వారు ఈ యుదంతమును విని యెంతయో సంతోషమును పొందిరి. ఎల్లవారును సుశీలయెడల

మఱి యింత గౌరవాదరములను ప్రదర్శింపసాగిరి.

**(4)** ఈ విధముగా ఇంటిలోని మగవారు కూడ సుశీలయెడల విశేష గౌరవాదరములను ప్రదర్శించుటను చూచి యింటిలోని ఇతరస్త్రీలు సహించలేకపోయిరి. వారి హృదయములలో సుశీలపై ఈర్ష్యాగ్ని జనించి పెచ్చరిల్లెను. వారు అందఱును మానసికముగ ఆమెపై కోపమును, ద్వేషమును పెంచుకొనుట మొదలుపెట్టిరి. ఏ విధముగానైన ఆమెను అవమానింపనెంచి రంధ్రాన్వేషణము చేయ నారంభించిరి. కాని నిజము అరయగా సుశీలయందు ఏదోషమును లేకుండెను. ఆమె యథాపూర్వముగా అందఱకును సేవలు చేయుచునే యుండెను. ఇతరుల శుభగుణాలను ప్రశంసించుచునే యుండెను. ఎవరి అవగుణముల వంకకు ఆమె కన్నెత్తి చూడనైన చూడదు. ఆ కారణమున ఆమెను అవమానించుటకు ఇంటిలోని యాడువారికి ఏ మార్గమును కానరాలేదు. వారి యీచిత్తవృత్తిని కనిపెట్టి వంటవాడు, సేవకుడును మొదటినుండియు సుశీలను ద్వేషించుచున్నవారు అగుటచే ఆమెపై గుప్త ప్రహారము గావింప సంకల్పించుకొనిరి.

ఒకనాడు ఇంటిలోని స్త్రీలు అందఱును వంటవానితోడను, సేవకుని తోడను గూడి సుశీలను పడగొట్టుటకు కుట్ర పన్నిరి. గుప్తముగా ఒక పథకమును సిద్ధము చేసిరి. దానిని అనుసరించి రామదేవి ఆకస్మికముగా తన బంగారపు మురుగు కానవచ్చుట లేదని తనకు సుశీలమీద అనుమానముగా ఉన్నదని ఒక అసత్యపు పుకారును లేవనెత్తెను. ఇంటిలోని మగవారు ఆపుకారును నమ్మలేదు. మఱి కొన్ని దినములు గడచిన మీదట తన పరికిణీ ఒకటి, చీర ఒకటి నిన్నటి నుండి కానవచ్చుటలేదని రోహిణి మఱియొక పుకారును సృష్టించెను. దినదినమును ఇంటిలో ఈ దొంగతనములు ఎట్లు జరుగుచున్నవి?

అని అప్పుడు మగవారికి ఒకింత ఆశ్చర్యము గలిగెను. అన్ని తావులందును అన్వేషణ జరిగెను. కాని ఫలితము గోచరించలేదు. మఱి నాలుగు దినములు గడచిన మీదట భగవానదేవి గడచిన రాత్రి నుండి తన బంగారపు హారము మాయమయ్యెనని క్రొత్తవార్తను సృష్టించెను. ఇంటిలోని వారు అన్ని దిక్కుల గాలించిరి. కాని ఆ హారము కానరాలేదు. ఎవరి వస్తువును వారే దాచుకొని నాటకము ఆడుచున్నప్పుడు అవి కానవచ్చుట యెట్లు సంభవమగును? పోయిన వస్తువుల విషయమున ఇంటిలోని స్త్రీలు అందఱును సుశీలమీదనే తమ అనుమానమును వ్యక్తము చేసిరి.

వారి వాడలో భక్తిదేవి యను వృద్ధురాలు ఒకరిత యుండెను. ఆమె పుట్టినిల్లును, సుశీల పుట్టినిల్లును ఒక యూరిలోనె యుండెను. అక్కడవారి యిండ్లు కూడ ఇరుగు పొరుగు ఇండ్లైయుండెను. ఆ వృద్ధురాలికి సుశీల తల్లితోడ గాఢమైన ప్రేమానుబంధమును ఉండెను.

ఆ భక్తిదేవి ఱేపటి దినమున తన పుట్టింటికి వెడలనున్నదని సేవకుడు ఇంటివారికి వార్తను అందించెను. అనంతరము అతడు, వంటవాడు, ఇంటిలోని యాడువారును గూడి కుట్ర చేసిరి. దానిని అనుసరించి కానవచ్చుటలేదని ప్రకటించిన నాలుగు వస్తువులను రోహిణి ఒక సంచిలో ఉంచి దానిమూతిని కుట్టివైచెను. వంటవానిచేత దానిని భక్తిదేవి దగ్గఱకు పంపించెను. దానితోబాటు ఒక చీటిని కూడ వానికి ఇచ్చి దానిని భక్తిదేవికి ఇమ్మని చెప్పెను. ''అమ్మకు అనేక నమస్కారములతో సుశీల వ్రాయునది - భక్తిదేవి చేత నీకు ఒక సంచిని పంపుచున్నాను. భద్రముగా ఉంచు! ఈ విషయము ఎవరికిని తెలియరాదు. జాగ్రత్త! అని ఆ చీటిలో వ్రాయబడి యుండెను.

వంటవాడు ఆ సంచిని, చీటిని కొనిపోయి భక్తిదేవికి ఇచ్చి - అమ్మగారూ! సుశీలమ్మగారు ఈ చీటిని, సంచిని మీకు ఇమ్మని నన్ను అంపినారు. మీరు రేపు వారి పుట్టినింటి వారి యూరికి వెడలుచున్నారట కదా! ఈ సంచిని, చీటిని వారి అమ్మగారికి మాత్రమే ఇమ్మని, తదితరులకు ఎవ్వరికిని ఈయవద్దని మీతో చెప్పుమన్నారు. అని చెప్పి యింటికి మఱలివచ్చెను.

ఆనాటి రాత్రియందే రోహిణి సుశీలను ఒక్కరితను విడిచి యింటిలో మిగిలియున్న స్త్రీలను, పురుషులను అందఱను ఒకచోట సమావేశపఱచి వారితో ఇట్లు చెప్పెను - అన్నలూ! వినుడు! ఈ మధ్య మన యింటిలో పర్యాయముగా వస్తువులు మాయమగుచున్నవి. వాని విషయమున మాకు సుశీల మీద అనుమానముగా ఉన్నది. మన వాడలో ఉన్న భక్తిదేవికి సుశీల తల్లితోడ గాఢమైన స్నేహానుబంధము ఉన్నది. రేపు ఆమె తన పుట్టినింటికి వెడలనున్నది. ఆమె ద్వారా సుశీల తన తల్లి దగ్గఱకు ఏమైన గుప్తముగా పంపివేయుచున్నదేమోని మాకు అనుమానము కలుగుచున్నది. ఈ రేయి గడచి తెల్లవాఱగనే భక్తిదేవి వెడలిపోవును. మనయింటి ముందు ఉన్న మార్గమే ఆమె వెడలు మార్గము. వెడలునప్పుడు ఆమెను నిలువరించి విచారణ జరపవలెను. ఆమె కొనిపోవు వస్తువులను పరిశీలింపవలెను.

అనంతరము ఆ రేయి గడచెను. తెల్లవాఱిన వెంటనే సుశీల భర్తయగు మోహనలాలు తన యింటి గుమ్మము దగ్గఱ కూర్చుండి భక్తిదేవి రాకకై ప్రతీక్షింప సాగెను. ఒకింతసేపటికి భక్తిదేవి చేత సంచిని గ్రహించి యింటి ముందు నుండి వెడలుచుండెను. ఆమెను నిలువరించి

మోహనలాలు పెద్దమ్మా! ఏమిటి కొనిపోవుచున్నావు? అని ఆమెను ప్రశ్నించెను. సుశీల తన తల్లికి ఇమ్మని ఒక చీటిని. ఈసంచిని నా దగ్గఱకు పంపినది నాయనా! అని ఆమె బదులు చెప్పెను. అది నీవు తీసుకొని పోవనక్కర లేదమ్మా! ఇటు నా చేతికి ఇచ్చివేయుము అని పలికి మోహనులాలు ఆమెనుండి సంచిని, చీటిని గ్రహించి ఇక నీవు వెడలుమమ్మా! అని ఆమెతో చెప్పెను.

అటు పిమ్మట మోహనులాలు ఆ సంచిని, చీటిని కొనిపోయి యింటిలోని మగవారి సమక్షమందు ఉంచెను. వృద్ధురాలు చెప్పిన మాటను వారితో చెప్పెను. సంచిని తెఱచి చూచుట జరిగెను. పోయినవనుకొన్న వస్తువులు అన్నియు బయల్పడినవి. ఉత్తరము చదువబడెను. అప్పుడు అందఱును అగ్గిమీద గుగ్గిలమువలె భగ్గున మండిపడిరి. ఆగ్రహోదగ్రుడై మోహనలాలు ఇంటిలోపలకు పోయి సుశీలను ఇట్లు కఱకు ములుకులవంటి పలుకులతో గద్దించెను - ఓసీ నీచురాలా! నీవు ఇక మా యింటిలో ఉండవద్దు! బయటకు పో! ఇంటిలోని వస్తువులను అన్నిటిని నీవే దొంగిలించితివి. నీవు భక్తిదేవి ద్వారా మీయమ్మ దగ్గఱకు చేరవేయ దలపెట్టిన సంచికి చీటికి సంబంధించిన నీ వ్యవహారపు గుట్టు అంతయు రట్టు అయినది. ఇక మేము ఎట్టి పరిస్థితిలోను నీవంటి దొంగబుద్ధుల రాకాసిని ఇంటిలో ఉంచుకొనుటకు ఇష్టపడము! పో! ఎక్కడకు పోవదలచుకొన్నావో అక్కడకు వెంటనే వెడలిపో!

అనుకొనని విధముగా వచ్చి మీద పడిన యీ భయంకర మిథ్యాదోషారోపణమునువిని సుశీల ఒక్క మాఱుగా కంపించిపోయెను. ఆమె కన్నులలో కన్నీరు పెల్లుబికెను. ఆమె యెంతయో కరుణాజనకముగా ఇట్లు మొఱపెట్టెను - స్వామీ! మీరు నన్ను

విశ్వసించుడు! నేను ఈ పని చేయలేదు. భగవంతుని మీద ప్రమాణము చేసి చెప్పుచున్నాను. నేను ఈ పని చేయలేదు. నేను ఇది యేదియు ఎఱుగను. మీరు అన్ని విషయాలను శాంతముగ ఆలోచించుడు! ఆమెకు ఈ సంచిని, చీటిని ఎవరు ఇచ్చిరో? ఒక్కమాఱు ఆ వృద్ధురాలిని అడిగిచూడుడు! నేను ఉత్తరమును వ్రాయలేదు. భక్తిదేవి దగ్గఱకు సంచిని పంపలేదు. మీరు ఆ ఉత్తరములోని వ్రాత యెవరిదో కొంచెము పరికించుడు. ఈ వ్యవహారమును మీరు విధిగా పూర్తిగా పరిశీలించుడు! ఈ విధముగా ఆమె ఏమి మొఱపెట్టినను క్రోధాంధుడైన కారణమున మోహనలాలు వినగల స్థితిలో లేకపోయెను. నా భార్య యింతటి నీచస్థాయికి దిగజాఱినదా? అని మానసికముగ అతడు మహాక్షోభమును పొందుచుండెను. క్రోధాంధుని బుద్ధి పని చేయదు. ప్రత్యక్షప్రమాణము ఉండగా ఇక వేఱుగా పరిశోధనము ఎందులకు? నేను నిర్దోషిని అని చెప్పుకొనుటకు నీకు సిగ్గులేదా? నా జీవితములో నీవు తీరని కళంకమును సృష్టించితివి. ఎన్ని విధాల కడుగుకొనుటకు ప్రయత్నించినను వదలనట్టి మసిని శాశ్వతముగా నాముఖము మీద పులిమివైచితివి. ఛీ! నీ ముఖము కూడ చూడకూడదు. పాపిష్ఠిదానా! పో! వెంటనే బయటకు వెడలిపో! అని మోహనలాలు ఈఁటెలవంటి మాటలతో ఆమె హృదయమును తూటులు పడునట్లు పొడిచెను. నిజమును గ్రహింపుమని సుశీల భర్తను వేయి విధముల దీనముగా, అతి దీనముగా ప్రార్థించెను. అయినను అతడు ఇక ఆమె మాటకు విలువను ఈయలేదు. ఆమెను వెంటనే బయటకు గెంటివైచెను. ఇంద్రసేనుడు అప్పటికి 4 ఏండ్లవాడు. ఇంద్రసేని 6 ఏండ్లది. వారిని ఇరువురను నాయనమ్మ తన దగ్గఱనే నిలిపివైచికొనెను. కుట్రలో భాగస్వాములగు వంటవాడు, సేవకుడు, ఇంటిలోని స్త్రీలు అందఱును

తమ ప్రయత్నము ఫలించినందులకు పరమానందమును పొందిరి. ఎంతయో ఉత్సాహమున త్రుళ్లుచు ఎగతాళిగా నవ్వుచు వారు - ఇంత పెద్ద పెద్ద ప్రగల్భాలు పలుకుచున్న యీమె తప్పక పరమనీచురాలై యుండునని మేము ముందే అనుకొన్నాము. కాని యీమె తన మాయ మాటల ఇంద్రజాలముతో అందఱను ఎట్లు సమ్మోహితులను చేసివైచినదో? ఎట్టులు అయిననేమి? ఈనాడు గుట్టు అంతయు రట్టు అయిపోయినది కదా! అని సుశీలను గూర్చి విపరీత వ్యాఖ్యానములు చేయసాగిరి.

తన యెడల ఇంత దారుణమును, అనుచితమును అగు వ్యవహారము సృష్టింపబడుటను గాంచి సుశీలకు హృదయములో క్రోధముగాని, ప్రతిహింసాభావము గాని గలుగలేదు. (దైవి సంపద 12 అక్రోధము, 10 ప్రతిహింసాభావము లేమి) ఆమె యెవరిమీదను ఎట్టి దోషమును ఆరోపింపక తన ప్రారబ్ధమునే నిందించుకొనసాగెను. అప్పుడు ఆమె తనలో ఇట్లు తలపోసెను - నిరపరాధినినైన నన్ను నా భర్తయే అసత్య దోషాదూషణమునకు, లేనిపోని నిందలకును గురిచేసి పరిత్యజించినప్పుడు ఇక నేను జీవించియున్న ఏమి ప్రయోజనము? కాని స్త్రీకి పతియే గతి, పతియే తీర్థము, పతియే వ్రతము, పతియే సర్వస్వము అని శాస్త్రములు చెప్పుచున్నవి కదా! కావున నా భర్త నన్ను ఏదశలో ఉంచిన అందే నేను తృప్తిని పొందుట యుక్తము. అనుక్షణమును ధైర్యమును వహించుటయే ఇప్పటి నా కర్తవ్యము. ఎవరికైనను కష్టములు రాకపోవు. బుద్ధిమంతుడగు వాడు ఎట్టి పరిస్థితిలోను కూడ ధైర్యమును, ధర్మమును విడువరాదు. భగవానుడు గీతలో కూడ చెప్పియున్నాడు -

శ్లో.దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః

వీతరాగభయక్రోధః స్థితధీర్మని రుచ్యతే. (2 - 56)

అనగా కష్టాలు వచ్చినవేళ ఉద్వేగమును పొందక సుఖాలు కలిగినప్పుడు అందు ఆసక్తుడు గాక మనములో రాగము, భయము, క్రోధమును లేక సర్వదా స్థిరమైన బుద్ధి గలిగి యుండువాడు ముని యనబడును. అని భావము.

తులసీదాసు కూడ -

"ధీరజ ధర్మ మిత్ర అరు నారీ, ఆపద కాల పరిఖి అహి చారి"

అని చెప్పియున్నాడు. అనగా ఆపదలు కలిగిన వేళ ధైర్యము, ధర్మము, మిత్రుడు ఆడ ది లేక భార్య అను ఈ నాల్గింటిని పరీక్షించి చూడవలెను అని సారాంశము.

కాబట్టి కష్టము కలిగిన వేళ ఉద్వేగమునకు, ఆవేశమునకు లోబడి జీవితమును అంతము చేసుకొనుట విజ్ఞతతో కూడిన పనిగాదు. అట్లు చేయుటవలన ఇహమునందును సుఖము లేదు పరమునందును లేదు. ఇప్పుడు ఇంటినుండి వెడలగొట్టబడుటవలన నాకు కలుగుచున్న దుఃఖముకంటె ఎన్నియోరెట్లు అధికమైన దుఃఖము ఆత్మహత్య చేసుకొనునప్పుడు అనుభవింపవలసియుండును. చనిపోవనెంచి నదిలో దుమికినవాడు కూడ మరణవేదనను భరింపలేక మఱల జీవింపనెంచుచు నీటినుండి బయల్వడుటకే ప్రయత్నించును. మరణింప నెంచి గరళమును సేవించినవాడు కూడ ఆ విషమును వెలిగ్రక్కి మఱల జీవించుటకే ప్రయత్నించును. ఒడలిపై కిరసనాయిలు చల్లుకొని నిప్పు అంటించుకొన్నవాడు వేదనను భరించలేక అరచి ఏడ్చి యేడ్చి అసువులను బాయును. అతనికి దుఃఖము కేవలము ఈ లోకమునందు మాత్రమే కలుగదు. మరణానంతరము కూడ అతడు అంధకారబంధురములగు

నరకములలో చిక్కి భయంకర క్లేశమును, దురంతమైన దుర్గతిని భరించును.

అసుర్యా నామ తే లోకా అంధేన తమసాऽऽవృతాః
తాగ్ం స్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కే చాత్మహనో జనాః.
(ఈశావాస్యము - 3)

గాఢమైన అజ్ఞానాంధకారముతో నిండియుండి అసురులకు సంబంధించినవిగా ప్రసిద్ధములైన మహాభయంకర నరకకూపములుగా ఎన్నబడు యోనులు, లోకములును ఏవియేవి గలవో ఆలోకములను, ఆయోనులను బలవంతముగా ఆత్మహత్య చేసుకొన్నవారు మరణానంతరము పర్యాయముగా పొందుచుందురు.

అట్లు మరణించినవారి అత్తింటి వారి వంశము, పుట్టినింటివారి వంశము రెండును అపప్రథను, శాశ్వత కళంకమును పొందును. ఇది నాకు బహు లజ్జాజనకమైన విషయమగును. (దైవీ సంపద - 19 లోకమునకు శాస్త్రమునకు విరుద్ధముగా పనిచేయుటకు సిగ్గుపడుట) ఉత్తమశ్రేణికి చెందిన స్త్రీలకు ఆత్మహత్యాసంకల్పము కలుగుటయే కళంక హేతువు. కావున నేను నాజీవితమును నాశము చేసుకొనకుందును గాక! భగవానుని దర్బారులో న్యాయమున్నది. నేను ఏపాపమును చేయలేదు. 'జీవన్ భద్రాణి పశ్యతి' అని పెద్దలు చెప్పుదురు. బ్రదికియుండిన శుభములను పడయవచ్చును. నేను బ్రదికి యున్నచో ఒకనాటికి నాకు ఈనాడు ప్రాప్తించిన కళంకము తనంత తానుగా తొలగిపోవునట్టి శుభసమయము రాకపోదు. అసత్యపు ప్రవాదము ఎంత కాలము నిలువగలదు? నేనే అన్న మాట యేమి? సాక్షాత్తు భగవానుడగు శ్రీకృష్ణునంతటివాడు శమంతకమణిని అపహరించెనన్న అపప్రథకు గురి కాలేదా? అనతికాలమునందే అది సమసిపోలేదా?' ఈ విధముగా

ఆలోచించి ఆమె హృదయములో ధైర్యము వహించెను. (దైవీసంపద - 23 ధైర్యము) స్వతస్సిద్ధముగా ప్రాప్తించిన కష్టమును భరించి ఆమె స్వధర్మపాలనరూపమైన తపస్సులో నిమగ్నురాలయ్యెను. (దైవీసంపద - 8 స్వధర్మపాలమందు కష్టమును భరించుట) ఇక ముందు తన దేహయాత్ర సాగించుటకు ఏది యుక్తమైన ఉపాయము కాగలదు? అని ఆమె ఆలోచింప మొదలుపెట్టెను.

(5)

సాయంకాలము అగునప్పటికి ఆమె ఒక ధర్మశాలకు చేరి అందు నిలిచెను. ఆమె నిత్యము నిరంతరముగా నియమపూర్వకముగా భగవద్ధ్యానము చేసుకొనుటకు అలవాటుపడిన వ్యక్తి. ఆ కారణమున ఆమెకు అంతఃకరణము పవిత్రమగుచు వచ్చెను. (దైవీ సంపద - 3 ధ్యానము 2 అంతఃకరణ సంశుద్ధి) ఆమె మనస్సును, ఇంద్రియములను అదుపులోనుంచుకొని (దైవీసంపద దమము) నిత్యము గీతా రామాయణాది సద్గ్రంథముల స్వాధ్యాయము (పఠనము) పవిత్ర భగవన్నామజపము చేయుచుండెడిది. (దైవీ సంపద స్వాధ్యాయము) ద్రోహబుద్ధి, ద్వేషభావము ఏదియు లేక మానసికముగా తన భర్తయొక్క మనోభావాలు పవిత్రములు కావలె నని భగవానుని దీనముగా వేడుకొనుచుండెడిది.

ఆమె చేతిలో ఆ సమయమున ఇంటివారి ద్రవ్యమునకు సంబంధించిన రు.5/-లు మాత్రము శేషించి యుండెను. ఆమె వాని ఆధారముతోనే తన భావి జీవనకార్యక్రమమును కల్పించుకొనుటకు సంకల్పించెను. మఱునాడు ఆమె ఒక పావలా వెచ్చించి కుట్టుపనికి ఉపయుక్తమగు ఒక పెద్దసూదిని, ఒక రూపాయి మూడు పావలాలు వెచ్చించి రంగుదారములు, అర్ధరూపాయి చెల్లించి పిండి, పప్పు, మసాలా ద్రవ్యములు, ఒక అణాను వెచ్చించి ఒక దొన్ని కొన్ని

ఆకులు, రెండు రూపాయల యేడణాలు ఇచ్చి ఒక బాల్చీ, ఒక ఇనుప బేసినిని కొని తీసుకొని వచ్చెను. ఆమె ఆ బేసినిలో పిండిని తడిపి ముద్దగా మర్దించి ఆ ముద్దను ఆకులో పెట్టుకొనెను. ఆబేసినినే బోర్లవైచి దానిమీద చపాతీలను అనంతరము కాల్చుకొనెను అప్పుడు ఆ చపాతీలను ఆకులో పెట్టుకొని ఆ బేసిన్ని కడిగి అందే పప్పును ఉడుకబెట్టుకొనెను. ఈ విధముగా తన భోజనమును సిద్ధము చేసుకొనెను. భోజనానంతరము సూదిని దారమును గ్రహించి రెండు చిన్న చడ్డీ, బనీనుల వంటి వానిని తయారు చేసి బజారులో విక్రయింపగా ఆమెకు మూడున్నర రూపాయలు లభించినవి. ప్రతిదినమును ఆమె ఈ విధముగా ఒక రూపాయి మూడు పావులాలు సంపాదింప మొదలుపెట్టెను. అందు మూడు పావులాలు వెచ్చించి తనకు రెండు పూటలకును చాలునంత మేఱకు భోజనసామగ్రిని సమకూర్చుకొని ఒక రూపాయిని నిలువ చేయసాగెను. 15 దినములలో ఈ విధముగా ఆమె దగ్గఱ రు.15/-లు నిలువ అయ్యెను. అప్పుడు రు.5/-లు అద్దె చెల్లించు నిబంధనముతో ఒక చిన్నయింటిని తన నివాసమునకై తీసుకొనెను. మఱియొక రు.5/-లు చెల్లించి తనకు వలయు వంట పాత్రలును, మిగిలిన రు.5/-లతో కుట్టుపనికి వలయు దారములను కొని తెచ్చుకొనెను.

అనంతరము సుశీల తాను చీర, లంగా, కప్పువస్త్రము, దుప్పటి, పఱపు వస్త్రము మున్నగువాని మీద పూవులు, లతలు, పక్షులు మున్నగువానిని అందముగా కుట్టగలనని, ఆకర్షణీయముగా తులసీ రామాయణములోని దోహా, చౌపాయులు, ఇతర శ్లోకములు మున్నగువానిని రచింపగలనని, కావలసినవారు వస్త్రములను తన

యింటికి పంపవలసినదని నగరములోనివారికి సూచనను అందజేసెను. ప్రజలు అట్లే ఆమె కడకు పంపుట మొదలు పెట్టిరి. అందాలు చిందు విధముగ ఆకర్షణీయముగా ఆమె రచించిన దోహా, చౌపాయి, శ్లోకము, లతలు, పువ్వులు మున్నగువానిని చూచి ఆమె యొక్క శిక్షణమును పనితనమును తలచి అందఱు ముగ్ధులు అగుచుండిరి. ఈ పనివలన సుశీలకు నెలకు రు. 150/- మొదలు రు. 200/- ల వఱకు ఆదాయము ప్రాప్తించసాగెను. ఒక సంవత్సర కాలము గడచిన మీదట ఆమె ఒక పెద్ద యింటిని అద్దెకు తీసుకొని అందు కన్యాపాఠశాలను ప్రారంభించెను. అందు నిశ్శుల్కముగా బాలికలకు భగవద్గీత, రామాయణము, వ్యాకరణము, మొదలైన హిందీ గ్రంథాలను, సంస్కృత గ్రంథాలను నేర్పసాగెను. ఆమె వారికి చదువుతో బాటు చేతిపనులు కూడ నేర్పుట మొదలు పెట్టెను. బాలికలు తయారు చేసిన వస్తువులను బజారులో విక్రయించి వేయుచుండెను. దాని వలన ఆమెకు ప్రతినెల రు. 200/- లు మిగులుచుండెను. ఈ విధముగా ఒక సంవత్సర కాలము గడవగా ఆమె దగ్గఱ అన్ని ఖర్చులును పోను రు. 2000/- ల రూపాయలు నిలువ యయ్యెను.

అటుపిమ్మట ఆమె ఒకింత భూమిని కొని అందు తాను నివసించుటకు ఒక కుటీరమును నిర్మించుకొనెను. ఇట్లు ఉండగా క్రమముగా రెండవ సంవత్సరము కూడ అతిక్రమించెను. అప్పటికి ఆమె దగ్గఱ రు. 5000/- నిలువ చేరెను.

మూడవయేట తానే సొంతముగా పట్టు, నూలు దారాలు, వస్త్రమును కొని దానిమీద పూవులు, లతలు, దోహా చౌపాయులు, గీతా రామాయణ శ్లోకములు మున్నగువానిని చక్కగా రచించి

సత్యమును (దైవీసంపద - II ]Ni) న్యాయమును మీఱక క్రయవిక్రయములు కూడ చేయుట మొదలు పెట్టెను. ఇతరులు ఎవరైన తమ వస్త్రముల మీద ఆ రచనలు చేయుమని కోరిన వారికిని చేసి ఇచ్చుచుండెను. ఆమె యొక్క సత్యము, న్యాయము, వినయము, ప్రేమపూర్వకమైన ప్రవర్తనము మున్నగు శుభలక్షణములచేత ప్రభావితులై జనులు ఆమెయందు సదభిప్రాయము గలవారగుచుండిరి. ఈ విధముగా వ్యాపారము చేయుచుండగా క్రమముగా ఆమె దగ్గఱ అనతి కాలమునందే రు. 15000/- నిలువ యయ్యెను. అన్ని ఖర్చులు పోను ప్రతినెల ఆమెకు ఇంచుమించుగా వేయి రూపాయలు మిగులుచుండెను. ఈ విధముగా రూపాయలు పెరుగుట వలన నగరములో ఆమెకు ప్రశస్తి వచ్చెను. ఎక్కువగా డబ్బుఉన్నదానివలె ఆమె ఎంతో గౌరవ పూర్వకముగా కాలము బుచ్చుచుండెను. క్రమముగా ఆమె తన భూమిలో దృఢమైన యింటిని కూడ నిర్మింపజేసుకొనెను. తన దగ్గఱ పనిచేయుటకు కొందఱు పనివాండ్రను కూడ నియమించుకొనెను. ఆమె వ్యాపారము మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లసాగెను. ఆమె యొక్క చరిత్రము, గుణములును సర్వవిధముల విశుద్ధములైనవి. ఆమెయొక్క కార్యకుశలత్వము సద్వ్యవహారమును కారణముగా ఎల్లయెడల ఆమెకు మంచిపేరు వచ్చెను. ఆమె హృదయములో దీనులు, దుఃఖగ్రస్తులు, దిక్కులేనివారు, పేదవారు, కుంటి, గ్రుడ్డి, గూనివాండ్రు అన్న ఎంతయో దయ (దైవీ సంపద 16 భూతదయ) యుండెను. ఆ కారణమున ఆమె వారికి ఆవశ్యకతను బట్టి అన్నము, వస్త్రము, మున్నగువానిని ప్రతిఫలాపేక్షారహితముగా దానము (దైవీసంపద 4 దానము చేయుట) చేయసాగెను. నిత్యము వండుకొన్న పదార్థమును భగవానునకు నివేదనము చేసి మంత్రరహితముగా బలివైశ్వదేవమును

ఆచరించి (అన్నాద్య సమతంబుగా అగ్నికి నాహుతుల సమర్పించి గోవునకు భుక్తి సమర్పించుట) మొదట అతిథులకు పెట్టి తరువాత తాను భుజింప సాగెను.

## (6)

అక్కడ సాధ్వీమతల్లి యగు సుశీలను ఇంటిలో నుండి బయటకు వెడలగొట్టిన కారణమున ఆమె అత్తమామలను, తోడికోడండ్రను మిగిలిన వారిని అందఱను నగరములోని వారు నిందింప మొదలు పెట్టిరి. ఇంటిలోని వారి నడుమ పొత్తులేకపోవుట, వివేకము తక్కువ అగుటయు కారణముగా క్రమక్రమముగా ఇంటిలోని సంపద అంతరించుట మొదలయ్యెను.

ఒకనాడు ఆ వాడలోని ఒక స్త్రీ రోహిణి కడకు వచ్చి - అమ్మా ! నాకు ఈనాడు ఏబది రూపాయల మొత్తము కావలసి వచ్చినది. ఆ మొత్తమును మీరు నాకు ఇచ్చినచో నేను నూటికి 2 రూపాయల వంతున వడ్డీతో ఆ సొమ్మును తిరిగి మీకు ఇచ్చివేసెదనమ్మా ! అని ఆమెను ప్రార్థించెను. అప్పుడు రోహిణి ఆమెను గొప్ప కుటుంబములోని వ్యక్తిగా తలచి ఆమెకు రు. 50/- ఇచ్చెను. వచ్చిన యామె రూపాయలను గ్రహించి యింటికి వెడలిపోయెను. కొన్ని క్షణములు గడచిన మీదట ఆమెయే మఱల రోహిణి కడకు వచ్చి - అమ్మా ! మీరు రు. 50/- అనుకొని పొరపాటున నాకు రు. 51/- లు ఇచ్చితిరమ్మా ! ఇదిగో ! మీ రూపాయి మీరు తీసుకొనుడు అనుచు ఆమె చేతిలో ఒక రూపాయిని ఉంచెను. అట్లు చేయుట వలన ఆమెపై రోహిణికి నిండుగా విశ్వాసము, సదభిప్రాయమును ఏర్పడెను. ఆమె ఇచ్చిన రూపాయిని తీసుకొని రోహిణి ఆమెను మంచి కుటుంబమునకు చెందిన స్త్రీగా భావించెను.

అనంతరము 15 దినములు గడచిన వెంటనే ఆ స్త్రీ రోహిణికి ఆమె ఇచ్చిన రు. 50/- లను అర్ధమాసమునకు అగు వడ్డీ ఒక రూపాయితో కలిపి మొత్తము రు. 51/- లు తెచ్చి యిచ్చివేసెను. అప్పుడు రోహిణి ఆమెతో తొందఱ ఏమున్నది? మఱికొన్ని దినములు ఉంచుకొనలేకపోయితిరా? అని ఆదరవచన మాడెను. నాకు ఆవశ్యకత కలిగినప్పుడు మఱల తీసుకొందునులే! తల్లీ! ఇప్పుడు అక్కఱలేదు అని బదులు పలికి ఆమె వెడలిపోయెను.

మఱికొన్ని దినములు గడచిన మీదట ఆమె రోహిణి కడకు మఱల వచ్చి - అమ్మా! నాకు ఈనాడు రు. 200/- ల మొత్తము కావలసివచ్చెను. తల్లీ! మీరు అప్పుగా ఈయగలరా? అని ఆమెను ప్రశ్నించెను. అడుగుటయే తడవుగా ఆమెకు రోహిణి రు. 200/- లు తెచ్చియిచ్చెను. 10 దినములైన గడవక ముందే ఆ స్త్రీ ఒక నెల వడ్డీ రు. 4/- లతో కలిపి రు. 200/- లను తెచ్చి మఱల రోహిణికి ఇచ్చివైచెను. దానితో రోహిణి హృదయములో ఆ స్త్రీయందు విశ్వాసము మఱి యింత బలముగా నాటుకొనెను.

మఱికొన్ని దినములు గతించిన పిమ్మట ఒకనాడు ఆ స్త్రీ రోహిణి దగ్గఱకు వచ్చి రోదింప మొదలు పెట్టెను. కారణము ఏమని రోహిణి ఆమెను ప్రశ్నించెను. మా కుటుంబములో ఒక పెండ్లి యున్నది అమ్మా! నా నగలను అన్నిటినీ మావారు తాకట్టులో ఉంచినారు. నగలు లేకుండ పెండ్లికి వెడలుటకు నాకు చిన్నతనము అగుచున్నదమ్మా! కాబట్టి ఒక్క మూడు రోజులపాటు పెండ్లిలో ధరించుటకు నాకు మీ నగ ఒకటి దయ చేసి నాకు ఈయగలరా? ఈయకున్న నా గౌరవము నిలువదమ్మా! అని యామె దీనముగా

బదులు పలికెను. రోహిణికి ఆమెపై గాఢమైన విశ్వాసము ఎట్లును ఉండనే ఉన్నది కదా! వెనుకముందులు ఆలోచించకుండ రోహిణి వెంటనే తన నగలను అన్నిటిని తీసి ఆమెకు ఇచ్చివేసెను. వానిని గ్రహించి ఆమె తన యింటికి వెడలిపోయెను. కాని అయిదు దినములు అయినను ఆమె మఱలి రాలేదు. అప్పుడు రోహిణి తానే ఆమె యింటికి వెడలెను. అమ్మా! మీ యింటిలో వివాహ కార్యము ముగిసినది కదా! అని ఆమెను ప్రశ్నించెను. మాయింట వివాహకార్యము ఎవరికిని లేనేలేదు. అని యామె బదులు చెప్పెను. మీ యింటిలో వివాహకార్యము ఉన్నదని చెప్పి మీరు నా నగలను తీసుకొని వచ్చితిరి కదా? అని రోహిణి మఱల ప్రశ్నించెను. మా యింట ఎవరికిని వివాహమును జరగలేదు. నేను మీ నగలను తీసుకొని రాను లేదు. మా దగ్గఱనే బోలెడు నగలు ఉన్నవి. మీ నగలను అడిగి తెచ్చుకొనవలసిన పని నాకు ఏముండును? అని ఆమె మఱల బదులు చెప్పెను. మీరు నాదగ్గఱకు ఎన్నియో మాఱులు వచ్చి రూపాయలను అప్పుగా గ్రహించి తిరిగి ఇచ్చి యుంటిరి కదా! మఱి యీనాడు ఈ విధముగా పచ్చియబద్ధములు ఆడుట మీకు తగునా? అని రోహిణి మఱల ఆరాటముతో ప్రశ్నించెను. నేనా? మీ దగ్గఱనా? అప్పు తీసుకొంటినా? సెబాసు! స్వయముగా మేమే బోలెడు డబ్బుతో వడ్డీ వ్యాపారము చేయుచున్నవారము. మాకు డబ్బునకు లోటులేదే! మఱినేను మీ దగ్గరకు అప్పునకై యేలవత్తును. మాయింట డబ్బునకు సంబంధించిన వ్యవహారము అంతయు మగవారే చేయుచుందురు. చాలును! చాలును! వారు మీ మాటలు విన్నచో మిమ్ము అవమానించిపోగలరు అని యామె మఱల ప్రత్యుత్తరమిచ్చెను.

ఆమె మాటలు విని రోహిణికి ఎంతో ఆశ్చర్యమయ్యెను. ఆమె తన యింటికి మఱలివచ్చి వ్యథిత హృదయముతో ఆ విషయమును తన తండ్రికి, సోదరులకు తెలియజెప్పి బోరున ఏడ్వసాగెను. ఆమె మాటలు విని తండ్రియు, సోదరుడును - నీవు ఆమెకు ఇచ్చిన నగల విషయమున కాగితము ఏదైన వ్రాయించి పుచ్చుకొంటివా? నీవు ఆమెకు నగలను ఇచ్చినప్పుడు నీదగ్గఱ ఇంకను ఎవరైన ఉండిరా? అని రోహిణిని ప్రశ్నించిరి. కేవలము నమ్మకము మీదనే నగలను ఇచ్చితిని. కాగితములు ఏవియు వ్రాయించలేదు. అక్కడ మూడవవారు ఎవ్వరును లేరు. అని యామె బదులు చెప్పెను. నీవు వ్రాతకోతలు ఏవియు చేయలేదు. ఈ విషయమున మనము చేయగలుగునది కూడ ఏదియును లేదు. ఏడువవలసినదే! అని తండ్రి, సోదరుడును పలికిరి. అందఱును నెత్తిమొత్తుకొని యూరకుండిరి.

ఇట్లుండగా ఒకనాడు దేవదత్త పండితుని దగ్గరకు సాధువు వేషమున ఒక యాచకుడు వచ్చెను. ఈ పండితుడు అతనికి విశేషముగా సేవలు చేసెను. మీ యోగక్షేమము చక్కగా సాగుచున్నది కదా? అని ఆ సాధువు పండితుని ప్రశ్నించెను. లేదు స్వామీ! చిన్న కోడలు వెడలిపోయినప్పటినుండియు ఇంటిలో కలహములు ఎక్కువగా చెలరేగుచున్నవి. లోకములో మాకు నిందలు పెరిగి మా జీవన నిర్వహణమార్గమునకు అవరోధములు అధికమైనవి. రానురాను నష్టాలు అధికము అగుచున్న కారణమున పిల్లలు వ్యాపారము చేయుట మానివైచిరి. మోహనలాలునకు బ్రతుకు తెరువు ఏదియు దొరకనే లేదు. అని పండితుడు బదులు చెప్పెను. అప్పుడు సాధువు నాయనా! నీకు నేనొక రసాయనవిద్యను (బంగారమును తయారు చేయుట) నేర్పెదను. దానివలన నీవు ప్రతిదినము 16 యవగింజల

యెత్తు బంగారమును ఉత్పత్తి చేసుకొనవచ్చును. అంతకంటె ఎక్కువ ఆశకు ఎన్నడును లోబడవలదు. ఏమందువు? అనెను. అంతకంటె కావలసినది ఏముండును? అది నా మహాభాగ్యమందును. నేర్పుడు! నేర్చుకొందును అని పండితుడు ప్రత్యుత్తర మిచ్చెను. అట్లయిన వెంటనే బజారునకు పోయి ఒక పావలా గంధకము ఒక పావలా పాదరసము, పుటము పెట్టి నిప్పులలో పెట్టుటకు ఉపయోగపడు మూస, కొన్ని బొగ్గులు, ఒక విషపు దినుసును తీసుకొనిరా! అని ఆ సాధువు కాని సాధువు పలికెను.వెంటనే పండితుడు వానిని తీసుకొని వచ్చెను. అప్పుడు ఆ వంచక సన్యాసి తన జోలెలోనుండి ఏవో ఆకులను వెలికి తీసి అవి యేమి ఆకులో పండితునకు ఎఱుగజెప్పి ఆ యాకుల రసముతో విషపు దినుసును, పాదరసమును, గంధకమును కలిపి పుటము పెట్టి పండితుని చేతనే మూసలో పెట్టించి దాని నిండ బొగ్గులను నింపి పిడకల దాలిలో పెట్టించెను. బొగ్గులు పూర్తిగా కాలిపోయిన మీదట పండితుడు దగ్గఱనే ఉండి అందు మఱిన్ని బొగ్గులు వేయసాగెను. అందువేయబడు బొగ్గులలోని ఒక బొగ్గులో చిన్న రంధ్రము గావించి పండితుడు చూడకుండ ఆ వంచకుడు అందు 16 యవగింజలు యెత్తు బంగారపు గుండును దూర్చి ఆరంధ్రమును బొగ్గుతోనే పూడ్చియుంచెను. పండితుడు నిప్పుల దాలిలో బొగ్గులు వేయుచు బంగారము గుప్తము చేయబడిన బొగ్గును కూడ అందు ఎప్పుడు పడవైచెనో! అప్పుడు వంచకుడు చాలును! ఇక బొగ్గులు వేయవలదు అని పండితునితో చెప్పెను. నిప్పులలో పడి గంధకము, పాదరసము, విషమును ఎగసిపోయినవి. బొగ్గు లన్నియు కాలిపోయినవి. అందు కడకు మూసలో 16 యవగింజల పరిమాణపు బంగారము మాత్రము మిగిలెను.

ఆ బంగారమును గాంచి పండితుని యానందమునకు పరిధులు లేవు. సాధువు వేషములో నున్న వంచకుడు వెడలిపోయెను. అతడు వెడలిపోయిన పిమ్మట దేవదత్తుడు బజారునుండి పెద్ద మొత్తము గంధకము, పాదరసము, విషపు దినుసును తెచ్చి యింటిలో నిలువ చేసుకొనెను. ప్రతిదినము ఆ దొంగసాధువు చెప్పిన విధముగా పుటము పెట్టి బంగారము చేయుటకు ప్రయత్నము చేయసాగెను. కాని తొలినాడు మూసలో కానవచ్చిన విధముగా మఱి యేనాడును పండితునకు బంగారము కానరాలేదు. ఒకనాడు ఆ సాధువే పండితుని యింటిముందునుండి వెడలుచుండెను. అతనిని చూచి పండితుడు పరుగిడి పోయి అతని చరణముల మీద వ్రాలెను. అతనిని తన యింటిలోనికి తీసుకొని వచ్చి సేవలు చేసెను. ఇప్పుడు నీ పరిస్థితి బాగున్నది కదా? అని సాధువు పండితుని ప్రశ్నించెను. లేదు. ప్రతిదినము, మీరు చెప్పిన విధముగానే పుటము పెట్టి ప్రయత్నము చేయుచున్నాను. కాని నా దురదృష్టము. బంగారము తయారగుటలేదు అని పండితుడు బదులు చెప్పెను. అయ్యో! అట్లయ్యెనా? అయినచో ఈనాడు నీయంతట నీవు మా సమక్షమున ఆ ప్రక్రియను అంతను మఱియొకసారి చేయుము! ఎందైన పొరపాటు ఉన్నచో చక్క జేసెదము అని ఆ సాధురూపము దాల్చిన వంచక సాధువు పలికెను. అప్పుడు సామగ్రులను తెచ్చుటకు పండితుడు ఇంటిలోనికి అరిగెను. ఆ సమయమునందే బొగ్గులో రంధ్రము గావించి సాధువు అందు బంగారమును గుప్తము గావించెను. సామగ్రికొఱకు ఎక్కడకో పోనక్కఱలేదు కదా! ఇంటిలోనే ఉన్నదికదా! పండితుడు వెంటనే సామగ్రి తెచ్చెను. యథాపూర్వకముగా గంధకము, పాదరసము, విషపు దినుసును ఆకు పసరుతో పుటము గావించి మూసలోపెట్టి బొగ్గుల నడుమ నిలిపి దానిని మఱికొన్ని బొగ్గులతో కప్పెను. మూసలోని బొగ్గులు కాలిపోవగా చూచి మఱికొన్ని

బొగ్గులను పట్టుకారుతో మూసలో వేయుమండెను. బంగారమును దాచిన బొగ్గు కూడ మూసలో వేయబడుటను పరికించి – పూర్తిగా ఒక గంట కాలము అయినది. ఇప్పటికి బంగారము సిద్ధమైపోవలయును. నీవు లేచి చూడు! ఇక బొగ్గులు వేయవలదు అని సాధువు పలికెను. ఒకింతసేపటికి బొగ్గులు అన్నియు కాలిపోయినవి. విషపు దినుసు, గంధకము, పాదరసము సర్వము ఎగసిపోయెను. కేవలము సాధువు చెప్పినంత మేరకు బంగారము మూసలో మిగిలెను. దానిని గాంచి దేవదత్తుడు పరమానందమును పొందెను. స్వామీ! ఇప్పుడు నాకు బాగుగా అర్థమైనది అని అతడు సాధువుతో పలికెను. అంతట ఆవంచక సాధువు వెడలిపోయెను.

మఱల దేవదత్తుడు గంధకము పాదరసము, విషపు దినుసు, ఆకు పసరులతో పుటము పెట్టి ప్రతిదినము బంగారమును చేయుటకు ప్రయత్నము చేయసాగెను. కాని అది సిద్ధించుటలేదు. మఱల అయిదారు దినములు గతించిన మీదట ఆ సాధువు తన యింటి ముందునుండి వెడలుచు దేవదత్తునకు కానవచ్చెను. తోడనే పరుగిడి పోయి ఇతడు సాధువు చరణముల మీద వాలిపోయెను. ఇప్పుడు నీ పరిస్థితి బాగున్నది కదా! అని అతడు ప్రశ్నించెను. ఏమియు బాగులేదు. మీరు అన్ని విషయములును ఎఱుగ జెప్పితిరి. నాచేత కూడ ప్రక్రియను ఆచరింపజేసితిరి. అయినను నా ప్రయత్నము ఫలించుట లేదు. కారణము ఏమో ఎఱుగరాదు. మీరు ఎదురుగా ఉన్నప్పుడు మీ మహిమ చేత ప్రయత్నము ఫలించుచున్నది. మీరు లేనప్పుడు లేదు. అని ఇతడు బదులు చెప్పెను. అప్పుడు అతడు ఇట్లు అనెను – అట్లయిన ఒకపని చేయుము మేము ప్రతిదినము నీ దగ్గఱకు రాజాలము. ఒక్కసారిగనే మేము నీకు ఈ జన్మకు చాలునంత బంగారము చేసి యిచ్చెదము. నీ యింటిలో ఇప్పుడు ఉన్న బంగారము అంతయు తీసుకొని రమ్ము!

దానినంతను హండీలో ఉంచి నిప్పుల మీద పెట్టుము! దానిలో నీరు పోయుము. అందు నీ దగ్గర ఉన్న గంధకము, పాదరసము, విషపు దినుసు అంతయు పడవేయుము! దానిమీద దట్టముగా మట్టిని దట్టించుము! దానిమీద నీటితో నింపిన మఱియొక హండీని నిలుపుము! 8 జాముల కాలము దాని క్రింద మంట పెట్టుచుండుము! అటుపిమ్మట దానిని తెఱచి చూచిన నీ బంగారము రెండింతలై నీకు లభించును.

ఆ మాటలు విని పండితుడు సంతుష్టాంతరంగుడై వెంటనే తన భార్య యొక్క నగల నన్నిటిని తెచ్చి ఒక హండీలో ఉంచెను. ప్రక్రియ అంతయు సాధువు చెప్పినట్లే చేసెను. కాని పైనున్న హండీలో నీరు తక్కువ అయ్యెను. నీరు తెచ్చుటకు అతడు లోనికి వెడలెను. ఆ సమయమందే యీ దొంగబాబా హండీలోని బంగారము అంతయు తీసి తన జోలెలో పెట్టుకొని దానికి బదులుగా కొన్ని గులకఱాలను హండీలో ఉంచి దానిని మట్టితో మూసివైచెను. అంతలో పండితుడు నీరు తీసుకొనివచ్చెను. పైనున్న హండీలో పోసెను. అప్పుడు క్రింద నున్న హండీ ఒక వంకకు ఒరగెను. దానిని లేవనెత్తి ఒరగకుండ చక్కజేసి పెట్టెను. అట్లు ఎత్తినప్పుడు ఆ హండీ బరువులో భేదము ఏదియు గోచరము కాలేదు. యథాపూర్వముగా ఉన్నట్టులే తోచెను.

బాబా రెండు మూడు గంటల కాలము మాత్రము కూర్చుండెను. అనంతరము – అయ్యా! నేను రేపు ఈ సమయమునకే వచ్చి హండీపై నున్న మట్టి పూతను తొలగించెదను. అప్పుడు నీకు రెట్టింపు బంగారము ప్రాప్తించును అని చెప్పి వెడలిపోయెను. మఱునాడు ఆ సమయమున దేవదత్తుడు సాధువు కొఱకు ప్రతీక్షించెను. పగలంతయు గడచినను అతడు రాలేదు. ఎందులకు వచ్చును? అతడు తన కార్యమును సాధించుకొని ఆ ప్రదేశమునుండి మాయమయిపోయెను. అతని కొఱకు చూచి చూచి మూడవనాడు దేవదత్తుడు తానే స్వయముగా హండీని

తెఱచి చూచెను. అందు తాను ఉంచిన బంగారము కూడ మాయమై దాని స్థానమున కేవలము కొన్ని గులకరాళ్ళు మాత్రము కానవచ్చెను. వానిని గాంచి అతడు గుండెలు బాదుకొనెను. నెత్తి మొత్తుకొనెను. జరిగిన సంఘటనమును ఇంటిలోని వారితో చెప్పెను. అది విని అందఱును పరితాపము చెందిరి. ఆ సాధువు కొఱకు అన్ని దిక్కుల యందును గాలించిరి. అతడు ఎందును కానరాలేదు. అతడు నిజముగా సాధువైన కదా కానవచ్చుట? సమాజములో అచ్చపు సాధువులయందు కూడ జనుల మనములలో అనుమానమును ఒదవించునట్టి వంచకశిఖామణి అతడు.

ఇట్లుండగా మఱియొకనాడు ఆ వాడలోనికి ఎఱ్ఱని వస్త్రమును ధరించియుండునట్టి మోసకత్తె ఒకతె వచ్చెను. ఆమె అక్కడ అద్దెకు ఒక ఇల్లు తీసుకొని స్థావరము ఏర్పరచుకొనెను. తంత్ర మంత్రములందు తాను సిద్ధి పొందినదానని, ఒక యోగినినని ఆమె జనులకు నలుగురకును తెలియజేసెను. ఆమె కడకు రోగనివారణమును కోరి ఒకతె, సంతాన లాభమును కోరి యొకతె, ధన లాభమును కోరి యొకతె, బిడ్డలకు పెండ్లిండ్లు కావలెనని యొకతెయుగా పలు కోరికలతో పలువురు స్త్రీలు వెడల నారంభించిరి. ఆవంచకయోగిని ఒకరికి ఏవియో ముడులున్న దారము, ఒకతెకు మంత్రము, ఒకతెకు యంత్రము, ఒకతెకు తాయెత్తు ఇచ్చి పంపుచుండెను. ఒక్కొక్కతెకు తానే స్వయముగా మంత్రమును వేయుచుండెను. ఈ విధముగా చేసి యామె అనుకొన్న కార్యము నెఱవేరుటకు ఒకరికి ఒక సంవత్సర కాలమును, మఱియొకరికి 6 మాసములు కాలమును, వేఱొకరికి రెండు నెలల కాలమును గడువుగా నిర్దేశించు చుండెను. ఈ విధముగా ఆ ధూర్తురాలు మాయమర్మములు ఎఱుగని స్త్రీలను వంచించి వారి నుండి నగలను, చీరలను, రూపాయలను హరించుట మొదలుపెట్టెను.

ఒకనాడు రామదత్తుని భార్య భగవానదేవి కూడ ఆమె ప్రశస్తిని విని ఆమె కడకు వెడలి – అమ్మా ! నాకు మగబిడ్డలు లేరమ్మా ! నాకు ఒక్క మగబిడ్డ కలుగుటకు ఉపాయము ఏదైన ఎఱుగజెప్పవా ? తల్లీ! ఒక యేడాది లోపల నా కోరిక ఫలించునట్లు నన్ను అనుగ్రహింపవా ? అమ్మా ! అని ఆమెను ప్రార్థించెను. అప్పుడు ఆ యోగిని ఇట్లు చెప్పెను – ఒక నెల లోపున నీవు గర్భవతి వయ్యెదవు. రాబోవు శనివారము నాటి రాత్రి నేను నీ చేత ఒక మంత్రతంత్ర ప్రక్రియను ఆచరింపజేసెదను. ఆ నాటి రాత్రి 10 గంటలకు నీవు ఇచ్చటకు రమ్ము ! ప్రక్రియకు సంబంధించిన సామగ్రి అన్నియు నా దగ్గఱనే ఉన్నవి. కేవలము నీవు ఆనాడు మంచి బట్టలు, నగలును ధరించి షోడశశృంగారములును గావించుకొని నా దగ్గఱకు వచ్చివేయుము ! "ఆ మాటలు విని భగవానదేవి అట్లే చేసెను. ఆమె శనివారమునాటి రాత్రి సర్వవిధ శృంగారములను చేసుకొని వచ్చెను. యోగిని ఆమె నగలను బట్టలను అన్నిటిని తీయించి ఒక గదిలో పెట్టించి ఆ గదికి తాళము వేసి తాళపు చెవిని ఆమె చేతికి ఇచ్చెను. పండ్రెందు గంటల రాత్రి అయిన మీదట ఆమె కొంత కుంకుమ, నూనె, ఒక మట్టి కమండలము, ఒక చిన్న ముక్కాలి పీటను గ్రహించి భగవానదేవిని వెంట నిడుకొని నాలుగు మార్గముల కూడలి దగ్గఱకు వెడలెను. అక్కడ ముక్కాలి పీట మీద కమండలమును నిలిపి అందు నూనెను, కుంకుమను వేసెను. భగవానదేవికి ఒక మంత్రమును ఉపదేశించి ఆమెతో – అమ్మా ! నీవు ఇక్కడ ఒక గంట సమయము గడచువఱకు ఈ మంత్రమును జపించుచుండుము ! ఇది రాత్రి సమయము. ఇంటి దగ్గఱ ఎవ్వరును లేరు. కావున నేను పోయి యింటి రక్షణ చేయుచుందును. ఒక గంట కాలము గడచిన మీదట ఈ కమండలమును, ముక్కాలి పీటను తీసుకొని వచ్చివేయుము ! అని చెప్పి తాను వెడలిపోయెను.

యోగిని యింటికి చేరి మాఱు తాళపు చెవితో గది తాళము తీసి అందు ఉన్న నగలను, విలువైన బట్టలను గ్రహించి అప్పటికప్పుడే ఆ ప్రదేశమును వీడి దూర ప్రాంతమునకు పాఱిపోయెను. ఒక గంట సమయము అయిన మీదట, భగవానదేవి వచ్చి చూడగా గది తెఱవబడియుండెను. అందు ఆమె పెట్టుకొన్న నగలు, బట్టలు మాయమయ్యెను. అది చూచి ఆమె బోరున ఏడ్చెను. దుఃఖము పొంగి పొరలగా సిగ్గుపడుచు తనయింటికి చేరి జరిగిన యుదంత మంతయు తనవారికి ఎఱుగజెప్పెను. ఇంటివారు ఆమెను అనేక విధముల పరుషోక్తులాడిరి. అనంతరము వారు ఆ యోగినికై గాలించిరి. కాని వారికి ఆమె దొరకలేదు. అప్పుడు వారు ఆమె నివసించిన ఇంటి వారి దగ్గఱకు వెడలి ఆమె చిఱునామా తెలుపుడని వారిని ప్రార్థించిరి. అప్పుడు వారు – అయ్యా! ఆమె మాకు ముందు నెలకు కూడ అద్దె చెల్లించివైచినది. ఆమె ఎక్కడకు వెడలినదో మేము ఎఱుగము. మా యింటికి తఱచుగా ఇట్టి ప్రయాణికులు వచ్చుచునే యుందురు. ఆ యోగిని ఎవరో, ఎక్కడకు పోయినదో మాకు ఎట్లు తెలియును? అని వారు బదులు చెప్పిరి.

ఈ సంఘటనములను అన్నిటిని కన్నులార చూచి, చెవులార విని సోమదత్తుని భార్య రామదేవి తనలో ఇట్లు ఆలోచించుకొనెను. "ఆడుపడుచగు రోహిణి నగలు ఎగసిపోయినవి. అత్తగారి నగలు అంతరించిపోయినవి. తోడి కోడలి నగలు కూడ త్రోవ చూచుకొని వెడలిపోయినవి. ఇక నా నగలు మిగిలి యున్నవి. చిన్నకోడలు వెడలిపోయిన మీదట ఇక్కడ సంసారయాత్రామార్గములు అన్నియు విచ్ఛిన్నములు అయిపోయినవి. ఇక ఇప్పుడు ఈ యింటివారు నా నగలనే అమ్ముకొని బ్రదుకవలసినవారై యున్నారు. ఇక వారికి వేఱు మార్గము లేదు". ఇట్లు ఆలోచించుకొని ఆమె తన నగలను అన్నిటిని

తన పుట్టినింటికి కొనిపోయి తన సోదరుని దగ్గఱ దాచుకొనివచ్చెను. ఆమె పుట్టినిల్లు ఆ యూరిలోనే మఱియొక వాడలో ఉండెను. ఆమె సోదరుడు బహు దుర్మార్గుడు. నయవంచకుడు. మొదటి నుండియు వాని చిత్తవృత్తి కలుషితముగానే యుండెను. అతడు రామదేవి నగలను అన్నిటిని అమ్మివేసి రూపాయలను తన వ్యాపారములోనికి తరలించివైచెను. కొన్ని దినములు గడచిన తరువాత ఒకనాటి రాత్రి తన యింటిలో దొంగలు తాళము బ్రద్దలు కొట్టి ప్రవేశించి తన సొత్తు అంతయు ఎత్తుకొనిపోయిరని అసత్యపు పుకారును లేవదీసి గందరగోళమును సృష్టించెను. తెల్లవాఱుటతోడనే అతడు ఏడ్చుట మొదలు పెట్టెను. జనులు ప్రోగుపడిరి. పోలీసులు వచ్చిరి. దొంగతనపు వార్త ఊరంతయు ప్రాకిపోయెను. క్రమముగా ఆ వార్త రామదేవికి తెలిసెను. వెంటనే ఆమె పరుగిడి తన సోదరుని దగ్గఱకు పోయి అన్నా! నా నగలైన మిగిలినవా? లేదా? అని అతనిని అడిగెను. అతడు విసుగుకొనుచు – నీ నగల మూలముగానే నా యింట దొంగతనము జరుగుట సంభవించినది. కాకున్న దొంగలు దోచుకొనుటకు నా యింటిలో ఏమున్నది? దొంగలు నీ నగలతోపాటు నాకు ఉన్న కొంచెపు సొత్తును కూడ ఊడ్చి పట్టుకొని పోయినారు అని బదులు చెప్పెను. అప్పుడు ఆమె అన్నయ్యా! నా వస్తువులైన నాకు ఈయవా? అని వాపోయెను. అంతట అతడు కుపితుడై – పో! ఇక్కడ నుండి పో! ఇంక ఎన్నడును నాకు నీ మొగమును చూపకు! నీ మూలమున మేము నాశనము అయిపోయినాము అని యీసడించుచు ప్రత్యుత్తరమిచ్చెను. పాపము! ఇక ఆమె ఏమి చేయగలదు? ఏడ్చుచు తన యింటికి తిరిగి వచ్చి జరిగిన విషయమును తన అత్తింటి వారికి ఎఱుగజెప్పెను. వారు ఆమెను అనేక విధముల గద్దించి పరుషోక్తులాడిరి. ఎవరు ఎన్ని పరుషవచనములు ఆడినను ఇక ప్రయోజనము ఏమి ఉండును?

అనంతరము వారు అందఱు స్వయముగా సంపాదించుకొని యెవరి ఖర్చును వారే భరించుకొనుటకు నిశ్చయము చేసుకొనిరి. తదనుసారముగా సోమదత్తుడు, రామదత్తుడును తమ తమ భార్యలతోడ వేఱుపడి పోయిరి. మిగిలినవారు మాత్రము కలిసియుండిరి.

(7)

ఒకనాడు ఇంటిలోని వారు అందఱును కూర్చుండి యుండగా దేవదత్త పండితుడు సరళ హృదయముతో ఇట్లు అనెను – "మన చిన్నకోడలు చేసిన అపరాధము అల్పమైనది. అందులకు మనము ఆమెను ఇంటిలో నుండి బయటకు వెడలగొట్టి ఆమె విషయమున అనల్పమైన అపరాధము చేసితిమి. ఈ కారణముననే మనకు ఈనాడు ఇట్టి దుర్గతి ప్రాప్తించినది. ఆమె బహు బుద్ధిమంతురాలు. ఎంతయో భాగ్యశాలిని. పరమోన్నతములైన ఆశయాలు గల నారీరత్నము. ఆమె యింటిలో ఉన్ననాడు మనకు ఇట్టి కష్టనష్టములు కలిగియుండెడివి కావు. ఈ మాటలను అందఱును సమ్మతించిరి. ఒకనాడు అందఱును గూడి సుశీల దగ్గఱకు వెడలవలెనని ఆలోచించిరి. కాని సిగ్గు కారణముగా ఆమె దగ్గఱకు పోవుటకు ఎవరికిని ధైర్యము చాలుట లేదు. ఎట్లెట్లో ఇంటిలోని వారి యీ యాలోచన విషయము సుశీలకు తెలిసెను. అప్పుడు ఆమె తనలో – నా యింటివారు నా దగ్గఱకు రావలెనని అనుకొనుచున్నారు. కాని వారు నా కంటె పెద్దవారు. వారిని నా దగ్గఱకు రప్పించుకొనుటలో నాకు మహత్త్వములేదు. స్వయముగా నేనే వారి చెంతకు అరుగవలయును అని తర్కించుకొనెను. మఱునాడు ఆమె స్వయముగా తానే తన అత్తవారి యింటికి వెడలెను. శ్రద్ధ, ప్రేమ, వినయము, సరళ స్వభావమును (దైవీసంపద – 9 ఇంద్రియములు, అంతఃకరణము సరళముగా ఉండుట) అతిశయింపగా అందఱి పాదములందును వంగివంగి వారికి వందనములు గావించెను. ఆమెను గాంచి అందఱును

సంతోషమును పొందిరి. దానితో పాటు తాము ముందు చేసిన కుకృత్యమును తలచుకొని దుఃఖమును, లజ్జను పొందిరి. అప్పుడు సుశీల వారితో ఇట్లు అనెను – మీరు అందఱును నా దగ్గఱకు రావలెనని ఆలోచించుచున్నట్లు నేను విన్నాను. అంతట నేనే మీ దగ్గఱకు వచ్చివైచినాను. కారణము ఏమన నేను మీ అందఱికంటెను చిన్నదానను. కావున నేనే మీ దగ్గఱకు వచ్చుట యుక్తము. అప్పుడప్పుడు మీ సేవకు దూరమైతిని గదా! అని మనములో బాధపడుచుండుదానను. కాని మీరు నన్ను వెడలగొట్టిన కారణమున మీ దగ్గఱకు వచ్చుటకు నాకు ధైర్యము చాలలేదు. కాబట్టి నా యీ అపరాధమును మన్నింపుడు!

ఆ మాటలు విని దేవదత్తుడు – అమ్మా! నీవు చేసిన అపరాధము అల్పమైనది. సాధారణమైనది. కాని ముందువెనుకలు ఆలోచింపకుండ మేమే పెద్ద అపరాధము చేసివైచితిమి అని పలికెను. సుశీల చేసిన అపరాధము ఆవంతయును లేదు. అది యంతయు కుట్ర అని ఆ దేవదత్తుడు ఏమి ఎఱుగును? ఇంటి పరిస్థితి యంతయు చెడిపోవుటయు, అందఱి తలల మీదను ఆపదలు విరుచుకొని పడుటయు కారణముగా కుట్రలో పాలుగొన్న ఆడువారి భయంకర పాపము వారి హృదయములను మిక్కిలి కంపింపజేసెను. వారిలో ఈర్ష్యావృత్తి అంతరించి పశ్చాత్తాపాగ్ని రగుల్కొనెను. వారు ఎంతయో పరితాపమును పొందిరి. ఏ పాపమును ఎఱుగని సుశీలపై తాము సామూహికముగా సాగించిన అత్యాచారము కారణముగానే తమకు ఇట్టి దురవస్థ ప్రాప్తించినదన్న నిశ్చయము వారికి కలిగెను. పరితాపాగ్నితో వారి హృదయములు కుతకుతలాడ కన్నులనుండి నులివెచ్చని కన్నీరు వెలికి ఉరుకసాగెను. అప్పుడు సోమదత్త రామదత్తుల భార్యలు ఇరువురును చేతులు జోడించుకొని తమ యత్త దగ్గఱకు చేరి కంపిత కంఠములతో – అత్తయ్యా! చిన్న కోడలు అపరాధము ఏదియు చేయలేదు. అసహనగుణమునకు లోబడి

మేమే ఆమెపై లేనిపోని దోషము నారోపించి ఆమెను కళంకితురాలిని గావించితిమి. దాని ఫలితమును ఇప్పుడు అనుభవించుచున్నాము అని చెప్పి రోదించిరి. అప్పుడు రోహిణి కూడ తన మనములోని వేదన మేరమీఱ ఇట్లు చెప్పెను. అమ్మా! నిజముగా చిన్న వదిన తప్పు ఏదియు లేదమ్మా! పెద్ద వదినల అపరాధము కూడ ఇందు విశేషముగా లేదు. కుట్ర పన్నినదానను, ఘోరమైన నేరము చేసిన దుష్టాత్మురాలను నేనే. నేనే స్వయముగా వదిన కంకణములను, హారములను, నా చీరను, లంగాను ఒక సంచీలో ఉంచి దాని మూతిని కుట్టి వంటవాని చేత ఆ ముదుసలి యామె దగ్గఱకు పంపితినమ్మా! ఆ చీటిని కూడ నేనే వ్రాసితిని. నాన్నగారితో ఆమెను గూర్చి అసత్యపు ఫిర్యాదు కూడ నేనే చేసితిని. ఈ మహాపాపమునకు అంతకును మూలకారణమను నేనే. ఈనాడు నేను పశ్చాత్తాపాగ్నిలో తగులబడిపోవుచున్నాను. ఈ భూమి బ్రద్దలై అందు నేను లీనమైపోయిన బాగుండునని నా మనము కోరుచున్నది. ఏ పాపమును ఎఱుగని పరిశుద్ధహృదయురాలు చిన్నవదిన. ఆమెను క్షమాభిక్ష మాత్రము ఏ మొగము పెట్టుకొని కోరగలను?

జరిగిన సంఘటనము యొక్క మూలకారణమును వ్యక్తము చేయుచున్న ఆ పలుకులను వినగా సుశీల హృదయము ద్రవించిపోయెను. ఆమె రెండు చేతులు జోడించుకొని అందఱతోడను - అమ్మా! జరిగినది ఏదో జరిగినది. ఇక ఆ విషయమును మనము అందఱమును మఱచిపోవుదము. మీరు చేసిన పనిని నేనొక అపరాధముగా భావించుటయే లేదు. అట్టి యెడ క్షమించవలయునట్టి ప్రశ్నయేలేదు. (దైవీ సంపద - 22. క్షమాగుణము.) ఆ మాటలు విని యామె భర్త మోహనలాలు బోరున ఏడ్వసాగెను. తాను చేసిన పనిని గూర్చి పశ్చాత్తాపాగ్నిలో బడి కుములుచు - అయ్యయ్యో! మోసము చేత హతుడ నయితివే! అన్నన్నా! నిజమెఱుగక నేను ఎంత పాపము చేసితిని? నేను దీనికి

ఏమి ప్రాయశ్చిత్తము చేసికొందును? అని అతడు విలపింపసాగెను. అప్పుడు సుశీల – స్వామీ! విచారించకుడు! విచారించకుడు! దేనిని గూర్చియు మీరు విచారింప నక్కఱ లేదు. జరిగిన యీ సంఘటనము విషయమున మీలో ఎవ్వరి దోషమును లేదు. ఇది యంతయు నా పూర్వజన్మకృతపాపముల ఫలము. కావున మీరు అందఱును ఆ విషయములను క్షమించి పొందు! నన్ను యథాపూర్వకముగా మీ దాసురాలినిగానే భావించుకొనుడు! నాకు ఉన్న సంపద అంతయు మీదే. దానిని మీరు ఇక్కడకు తెప్పించుకొనుడు! అని పలికెను.

ఈ మాటలు విని అందఱును ఎంతయో సిగ్గుపడిపోయిరి. నీ వస్తువులను మేము ఎట్లు తెప్పించుకొనగలము? అని వారు సంకోచమును వెలిబుచ్చిరి. అప్పుడు సుశీల ఇట్లనెను. – ఆ సంపద యంతయు మీదే. నేను కూడ మీదాననే. భగవానుడు ఇది యంతయు మన మేలునకే చేసెను. అట్లే కాకున్న ఈనాడు నా మూలమున ఈ సంపదయు, నెలకు వేయిరూపాయల ఆదాయము ప్రాప్తించునట్టి సుస్థిరవ్యవస్థయు ఎందులకు ఏర్పడును? ఈ విధముగా పలికి సుశీల తన చరాస్తిని అంతను తన పనివాండ్ర చేత తెప్పించి <u>నిస్స్వార్థ భావముతో తన మామ పాదముల ముందు ఉంచెను</u> (దైవీ సంపద – 13. పనులలో స్వార్థము లేకుండుట, తాను కర్తను అను అభిమానమును వీడుట) ఆమె యొక్క ఇతర కార్యకలాపము లన్నియు కూడ అత్తింటివారి పర్యవేక్షణమునందు సాగిపోవుట మొదలయ్యెను. ఆమె మఱల అత్తవారి యింటనే నివసింపసాగెను. ఆమె యొక్క యీ <u>పవిత్ర వ్యవహారమును</u> గాంచి జనులు ఎల్లరును ముగ్ధులైరి. (దైవీ సంపద – 24. బాహ్యశుద్ధి)

అంతలో ఆటలు ఆడుకొని ఇంద్రసేనుడు, ఇంద్రసేనియు ఇంటికి తిరిగి వచ్చిరి. వారు చాల దినముల తరువాత తల్లిని గాంచి పరుగు

పరుగున వచ్చి యామె పాదముల మీద వ్రాలిపోయిరి. వారిని ఆమె లేవనెత్తి కౌగిలించుకొనెను. వంటవాడు, సేవకుడును తాము చేసిన ఘోరకృత్యమును దలచుకొని కంపించిపోవుచుండిరి. సిగ్గుతో తల యెత్తలేక క్రుంగిపోవుచుండిరి. వారి దేహములనుండి చెమ టలు బయలు వెడలుచుండెను. వారి కన్నుల నుండి పశ్చాత్తాపపు వేడి వేడి అశ్రువులు దిగజాఱుచుండెను. వారి మూగవేదనను, పశ్చాత్తాపమును గాంచి సాంత్వనవచనములు ఆడి ఆమె వారికి ఊఱట గొలిపెను. ఈనాడు ఆ యిరువురి జీవితమును కూడ మాఱిపోయెను.

అటుపిమ్మట ఆమె - అక్కా! అక్కా! మీరు ఇరువురు కుటుంబమునుండి విడిపోయి వేఱువేఱుగా ఉండసాగిరి అని నేను వినియున్నాను. కాని మీరు అట్లు వేఱుగా ఉండుటను నేను భరింప జాలను. యథాపూర్వముగా మీరు ఇరువురును కూడ నాయందు దయ యుంచి ఇక్కడే ఉండవలెనని నేను మిమ్ము కోరుచున్నాను. అని తన తోడికోడండ్రను ప్రార్థించెను. వారు సుశీల యొక్క సత్ప్రవర్తనమును గాంచి ఆమె కోరికను కాదనలేకపోయిరి. అనంతరము అందఱును గూడి ఉమ్మడి కుటుంబముగా కలిసి మెలిసి యుండసాగిరి. సుశీల యొక్క ప్రభావము చేత అందఱును సదాచార పరాయణులు, సచ్చరిత్రులును అయి చరింపసాగిరి. వారి విషయమున విస్తరించిన అపవాదులన్నియు సమసిపోయెను. వారి యిల్లు ఇతరులకు అందఱకును ఆదర్శప్రాయము అయ్యెను.

## (8)

సుశీల అందఱియందును సమభావముకలిగి మెలగుచుండెను. ఆమె తాను ఏమి తిన్న దానినే సమాన భావముతో ఇంటిలోని

వారికి అందఱకును తినిపించును. తాను ఏది ధరించిన దానినే వారిచేత ధరింపజేయును. అన్నపానముల విషయమున గాని ఆమె హెచ్చుతగ్గులను పాటింపదు. తన భర్తకు, బిడ్డలకును ఆమె యేది తినుటకు, కట్టుకొనుటకు అర్పించుచుండెనో దానినే తన తోడికోడండ్రకు, అత్తమామలకు, ఆడుపడుచునకును కూడ అర్పించుచుండెను.

ఒకనాడు ఆమె తన బిడ్డలకు ద్రాక్షపండ్లు, ఖర్జూరాలు, బాదంపప్పు, పిస్తాపప్పు మొదలైన వానిని తినుటకు పంచి యిచ్చుచుండెను. అంతలో వారితో ఆటలాడుకొను ఇతర బాలురు కొందఱు లోపలకు వచ్చిరి. అప్పుడు సుశీల ముందుగా తన బిడ్డలకు పెట్టక వారికి పంచి యిచ్చెను. తన బిడ్డలకు ఎంత పెట్టెనో అంతయు వారికి కూడ పెట్టెను. అందును కూడ మేలైన వస్తువులను బయటి పిల్లలకు పెట్టి నాసిగా ఉన్నవానిని తన బిడ్డలకు పెట్టెను. సుశీలయొక్క ఈ ప్రవర్తనము పిల్లల మనసులపై మంచి ప్రభావమును చూపెను. ఆమె బిడ్డలు కూడ సహజముగా మంచి స్వభావము గలవారు. వారు కూడ తల్లి తమకు ఇచ్చిన దానిలో సగము తమ మిత్రులకు పంచి యిచ్చిరి. సత్స్వభావము మూర్తీభవించిన సుశీల కన్నబిడ్డలు సత్స్వభావులుగా తీర్చిదిద్దబడుటలో ఆశ్చర్యము ఏమున్నది ?

సుశీల తన భర్తకు కూడ విశేషముగా సేవలు చేయుచుండెను. అప్పుడప్పుడు ఆమె తన భర్తతోడ పురాణ ప్రవచనమును ఆలకించుటకు వెడలుచుండెను. అప్పుడు ఆమె బిడ్డలు కూడ ఆమెను అనుసరించి వెడలుచుండిరి. చిన్నపిల్లలలో చంచలత్వము ఉండుట సహజము కాని ఆమె బిడ్డలలో ఆ లక్షణము లేదు. వారు బహు శాంతప్రకృతి కలవారు. కారణము ఏమన వారి తల్లియగు సుశీలయొక్క స్వభావము చాంచల్యరహితమైనది. (దైవీసంపద – 20 వ్యర్థకపు చేష్టలకు పాల్పడకుండుట.) ఆమె బిడ్డలు ప్రవచన స్థానమునందు ప్రశాంతముగా కూర్చుండి శ్రద్ధగా

ప్రసంగమును ఆలకించుచుండువారు సుశీల ప్రతిదినము తన బిడ్డలకు చక్కని క్రమశిక్షణమును అలవరచుచుండెను. ఆమె వారికి ఉపదేశించు విషయములు ఇట్లు ఉండెను. – నాయనా! ప్రతిదినము సూర్యుడు ఉదయించుటకు ముందు మేల్కొనవలెను. నిత్యము పెద్దలకు నమస్కారములు చేయవలెను. అసత్యమాడుట, కపటము, దాపరికము, హింస, చౌర్యము మున్నగు అవలక్షణములకు దూరముగా ఉండవలెను. సర్వదా సత్యమునే పలుకవలెను. ఎవరిని గూర్చియు అపశబ్దములు ఆడరాదు. ఎవరితోడను జగడము లాడరాదు. ఒకరిని ఒకరు కొట్టుకొనరాదు. తిట్టుకొనరాదు. సూర్యదేవునకు నిత్యము అర్ఘ్యప్రదానము చేయవలెను. ఏ పదార్థమును కూడ భగవదర్పణము చేయకుండ తినరాదు. అందఱకు సేవ చేయవలెను. బజారు వస్తువులను తినరాదు. బీడి, సిగరెట్లు, పుగాకు, భంగు, గంజాయి మొదలగు మత్తుపదార్థములను సేవింపరాదు. నాటకములు, సినిమాలును చూడరాదు. క్లబ్బులలో ప్రవేశించరాదు. భగవత్కథాప్రవచనము, కీర్తనము, సత్సంగమువంటి కార్యక్రమములందు ప్రశాంతముగా పాల్గొనవలెను. ఏ పదార్థము లభించినను దగ్గఱగా ఉన్న మిత్రులకు పెట్టి తాను తినవలెను. పెద్దల ఆజ్ఞను తిరస్కరింపరాదు. సర్వదా కర్తవ్యనిష్ఠ కలిగి యుండవలెను. ఎవరి యింటికైన వెడలినప్పుడు ఆ యింటివారిని ఏ వస్తువును కోరరాదు. వారు ఇచ్చినను స్వీకరింపరాదు. సాధ్యమైనంతవఱకు పరులకు సేవ చేయవలెను. ఎన్నడును పరుల సేవలను గ్రహింపరాదు.

ఆహా! ఇది యెంత చక్కని శిక్షణము? ఈ విధముగా ఇంటిలో నిత్యము నియమపూర్వకముగా పిల్లలకు మంచి విషయములు ఉపదేశించుచు, కథాకీర్తనాదికార్యక్రమములందు పాల్గొనుచు సుశీల సానందముగా కాలము గడుపుచుండెను. ఆమె ప్రవర్తనము వలన పిల్లలు, ఇంటిలోని వారును ప్రభావితులై చక్కని ఉత్తమ శిక్షణమును పడసిన వారి వలె పరిణతులు కాసాగిరి.

## (9)

సుశీల తండ్రి గోవింద రామపండితుడు. అతడు తన కొమరితయగు సుశీలను ఒకమాఱు తన యింటికి రప్పించుకొన దలచెను. అందులకై అతడు ఒక వ్యక్తిని దేవదత్తుని కడకు పంపెను. అతడు వచ్చి దేవదత్తునితో - అయ్యా! సుశీల మీ యింటికి వచ్చి చాల దినములు అయినది. కావున పిల్లలతోడ ఒక్కమాఱు ఆమెను పుట్టినింటికి పంపుడని ప్రార్థించుచున్నట్లు ఆమె తండ్రిగారు మీతో చెప్పుమన్నారు అని చెప్పెను. అట్లు పిలుపు వచ్చిన పిమ్మట సుశీల తాను స్వయముగా కూడ తన యత్తమామలను సమీపించి - నేను నా తల్లిదండ్రులను చూచి చాలకాలము అయినది. కావున మీరు అనుమతించినచో ఒక్కమాఱు నా పుట్టినింటికి పోయి వచ్చెదను. మీరు సమ్మతించినచో కొన్ని దినములు అక్కడ ఉండి వచ్చెదను. అని వారికి సవినయముగా తన యభిమతమును ఎఱిగించెను. అత్తమామలు ఇరువురును ఎంతో సంతోషముతో - వెళ్ళిరా! తల్లీ! వెళ్ళిరా! కాని ఎక్కువ విలంబము చేయకు! నీవులేకున్న మాకు దినములు గడచుట కష్టము. కావున సాధ్యమైనంత శీఘ్రముగా మఱలిరా! తల్లీ! అని తమ యంగీకారమును తెలిపిరి. అటుపిమ్మట వారు ఆమెను, బిడ్డలను ఆమె పుట్టినింటి నుండి వచ్చిన వ్యక్తి వెంట పంపివైచిరి.

సుశీల బిడ్డల తోడ పుట్టినిల్లు చేరి తన తల్లిదండ్రులకు పాదాభివందనములు ఒనరించెను. నీ యింటిలో అందఱును క్షేమముగా ఉన్నవారు గదా! అని తల్లిదండ్రులు ఆమెను ప్రశ్నించిరి. ఆ! ఆ! భగవానుని దయవలన అందఱును క్షేమముగా ఉన్నారు. కాని యిక్కడ అన్న రామలాలు, వదిన కానవచ్చుటలేదు. వారు ఏమైనారు? అని సుశీల ప్రశ్నించెను. అప్పుడు గోవిందరామ పండితుడు - అమ్మా! వాడు ఈ మధ్య మా నుండి విడిపోయి వేఱుగా అద్దెకు ఒక

యిల్లు తీసుకొని అందు నివసించుచున్నాడు. తన సంపాదన అంతయు తన అన్నపానములకు, తన మిత్రుల విందువినోదములకును వెచ్చించివేయుచున్నాడు. మేము ఇప్పుడు ముదుసలివారము అయిపోయితిమి కదా! నాకు ఇప్పుడు సంపాదించుటకు శక్తిలేదు. పూర్వము ఉన్న ఆస్తినే అమ్ముకొని యెట్లో కాలము బుచ్చుచున్నాము. అని బదులు పలికెను. ఏమి? వదినెయే ప్రోత్సహించి వానిచేత వేఱు కుంపటి పెట్టించినదా? కాక వేఱుగా కారణము ఏమైన ఉన్నదా? అని సుశీల మఱల ప్రశ్నించెను. లేదమ్మా! వదినె మంచి కుటుంబములో పుట్టినపిల్ల. నేను ఎప్పుడైన ఆమెను ఏమైన అన్నను కోపము తెచ్చుకొనునది కాదు. ఆమె ఎన్నడును అలుగుట యెఱుగదు. జగడమాడుట యెఱుగదు. ఎవరైన ఆమెను గూర్చి కటువుగా మాటలాడినను నవ్వి యూరకుండునది. కాని ప్రతిఘటించి యెఱుగదు. ఆమె బహు ఉత్తమురాలు. సౌశీల్యవంతురాలు. ఇప్పుడు కూడ ఆమె నా పక్షము వహించి రామలాలుకు నచ్చజెప్పుచునే యున్నది. ఆమె స్వభావమును, సేవను, వియోగమును తలచుకొని తలచుకొని నేను ఏడ్చుచున్నాను. రామలాలు కూడ సహజముగా మంచివాడే. కాని యీ కాలపు ఉద్దండులైన యువకుల సాంగత్యము చేత ప్రభావితుడై మా నుండి విడిపోయి వేఱుగా నివసింప మొదలు పెట్టినాడు. అని తల్లి సమాధానము చెప్పెను.

అప్పుడు సుశీల - అమ్మా! నేను పోయి అన్నకు, వదినెకు నచ్చజెప్పి వారిని ఇక్కడకు తీసుకొని రాదలచుచున్నాను. ఈ విషయమున నీ యభిప్రాయము ఏమి? అని తల్లిని అడిగెను. అంతకంటె కావలసినది ఏమున్నది? అట్లు జరిగిననాడు నా మహా భాగ్యములనుకొందును అని తల్లి బదులు పలికెను.

సుశీలయొక్క అన్న యగు రామలాలు ప్రయాగలోనే దూరముగా వేఱొక వాడలో నివసించుచుండెను. సుశీల తన కుటుంబమునకు చెందిన ఒక వ్యక్తిని తోడుగా గ్రహించి బిడ్డలతోడ తన అన్న యింటికి వెడలెను. ఆ సమయమున రామలాలు ఇంటిలో లేడు. వదిన కూర్చుండి యుండెను. సుశీల రాగా చూచి ఆమె లేచి ఆదరము, ప్రేమ మీఱగా స్వాగతము పలికెను. సుశీల తన బిడ్డలతోడ ఆమెకు పాదాభివందనము చేసెను. సుశీల తనకు నమస్కారము చేయువేళ వదిన కొంచెము సంకోచమును పొందెను. అమ్మా! నీవు నాకంటె పెద్దదానవు. తల్లివంటి దానవు. పెద్దవారికి పాదాభివందనము గావించుట పిన్నవారి కర్తవ్యము. కావున శంకింప పనిలేదు అని సుశీల ఆమెను సమాధానపఱచెను. అప్పుడు వదినె సిగ్గుపడుచు సుశీలతో - తల్లీ! నీవు మీ అమ్మగారి యింటికి వచ్చితివని నాకు తెలిసినది. మీ అన్న ఏమైన అందురేమో అని జడిసి నేను అక్కడకు రాలేకపోయితిని అని పలికెను. అంతట సుశీల మఱల ఇట్లనెను. - అందులకై నీవు చింతింప నక్కఱలేదు. అమ్మ నీ స్వభావమును, సేవను మెచ్చుకొనుచు నీ యెడబాటును భరింపలేక యేడ్చుచున్నది.

సుశీల ఇట్లు పలుకుచుండునంతలో బయట నుండి రామలాలు తిరిగి వచ్చెను. బిడ్డలతో సుశీల వెంటనే అతని పాదములను అంటి నమస్కారము చేసెను. రామలాలు కూడ అమెతోడ మిక్కిలి ఆదరపూర్వకముగా వ్యవహరించెను. కుశల ప్రశ్నలు పూర్తియైన తరువాత సుశీల అతనితో - అన్నా! నీవు ఈ విధముగా ఈనాడు అమ్మను, నాన్నను విడచి యిక్కడ వేఱుగా ఉండుట చూచి నాకు చాల బాధ గలుగుచున్నది అని పలికెను. అప్పుడు రామలాలు - 'చెల్లీ! నీవు వచ్చితివి అన్న వార్త తెలిసినది. నీ దగ్గఱకు రావలెనని, నిన్ను చూడవలెనని నాకు కుతూహలము అధికముగానే యున్నది. కాని

నేను అక్కడకు వచ్చినచో అమ్మ, నాన్న నన్ను ఏమైన అందురేమో అని శంకించి రాలేకపోయితిని. నీవే ఇక్కడకు రమ్ము! అని నీకు కబురు అంపుదము అని అనుకొంటిని. కాని అమ్మ, నాన్న నిన్ను ఇక్కడకు పంపరని తలచి ఊరకుంటిని. అని బదులు చెప్పెను. అన్నయ్యా! ఇందు నీ దోషము ఏమియును లేదు. నిన్ననే వచ్చి నిన్ను దర్శించలేకపోయితిని. అది నా దోషమే. కాని అన్నయ్యా! నేను అత్తవారి యింటికి వెడలునప్పటికి మీరు ఇరువురు అమ్మనాన్నల దగ్గఱ ఉండి వారికి సేవలు చేయుచు, వారి యాజ్ఞలను పాలించుచు వారి యోగక్షేమమును కనుగొనుచు ఉండువారు గదా! నాటి నీ సత్ప్రవర్తనమును తలచికొనగా నాకు నీవు ఈనాడు వారిని విడచి వేఱుగా ఎట్లు ఉండగలుగుచున్నావు? అని ఆశ్చర్యముగలుగు చున్నది. నేను ఏవైన పొరపాటులు చేసిన నీవు నన్ను మందలించి యుక్తమైన మార్గములో నడపించుచుండువాడవు. ఆ విషయములను నేను ఇప్పటికిని మఱవలేదు అని సుశీల మఱల పలికెను.

అప్పుడు రామలాలు మఱల ఇట్లనెను. – చెల్లీ! నీ మాటలు వినగా నాకు సిగ్గు అగుచున్నది. నేను వేఱుగా ఉండుటకు కారణము ఏమన్న నా మిత్రులు ఎవరెవరో మన యింటికి వచ్చుచుండువారు. వారి రాక అమ్మకు నాన్నకు రుచించెడిది కాదు. ఆ పరిస్థితిని గాంచి నా మిత్రులకు కష్టము కలుగుచుండెడిది. అప్పుడు వారు నాకు – మిత్రమా! మీ అమ్మ నాన్నల సర్వమును వారి దగ్గఱనే విడచిపెట్టి వారి నుండి విడిపోయి నీవు వేఱుగా కాపురము ఉండుట మంచిది. అందువలన నీకు నింద యేదియును గలుగదు. నీవు చదువుకొన్నవాడవు. యోగ్యుడవు. నీ సంపాదనతో నీవు బ్రదుకుట మంచిది. తల్లిదండ్రుల ధనముపై ఆధారపడి బ్రదుకుట నీవంటివానికి తగనిపని. అని నాకు హితబోధ చేసిరి. వారి మాటల చేత ప్రభావితుడనై

నేను వేఱు కాపురము పెట్టుకొంటిని. సోదరీ! నీవు బుద్ధిమంతురాలవు. నీ పేరునకు తగినట్లు సౌశీల్యము గల దానవు. కావున ఇప్పుడు నేను ఏమి చేయదగునో నీవే నాకు ఎఱుగచెప్పుమా!'

అనగా విని సుశీల ఎంతయో కోమలముగాను, మృదువుగాను ఉండు విధమున ఇట్లు బదులు చెప్పెను. (దైవీ సంపద-18. కోమల స్వభావము గలిగియుండుట)★ అన్నా! నేను ఏమి చెప్పగలను? నాలో మంచితనము ఏ కొంచెము ఉన్నను అది నీ శిక్షణము వలన ప్రాప్తించినదే! నేను ఏమి చెప్పినను నీవు నేర్పినదానినే చెప్పెదను. కొన్ని వందల యేండ్లు సేవ చేసినను మానవుడు మాతాపితరుల ఋణమును తీర్చుకొనజాలడని నా చిన్నప్పుడు నీవే నాకు చెప్పుచుండువాడవు. మాతాపితరుల సేవయే పరమధర్మము. తక్కినవి అన్నియు ఉప ధర్మములు ★ ఈనాడు అమ్మానాన్నలను విడచి వేఱుగా ఉన్న నిన్ను చూడగా నాకు ఎంతో ఆశ్చర్యము అగుచున్నది.

---

★ మనువు చెప్పిన మాట - శ్లో. యం మాతాపితరౌక్లేశం సహేతే సంభవే నృణామ్.

న తస్య నిష్కృతిః శక్యా కర్తుం వర్షశతైరపి. (2-227)

అనగా మానవుడు జన్మించునప్పుడు తల్లి దండ్రులు భరించు వ్యథకు బదులుగా వారికి కొన్ని వందల యేండ్లు సేవ చేసినను అతడు వారి ఋణము నుండి విముక్తుడు కాజాలడు అని భావము.

కావుననే - శ్లో. త్రిష్వేతేష్వితి కృత్యంహి పురుషస్య సమాప్యతే.

ఏష ధర్మః పరః సాక్షా దుపధర్మో2న్య ఉచ్యతే. (2-337)

అనగా తల్లి, దండ్రి, గురువు - అనబడు ఈ మువ్వురను సేవించుటతో పురుషుడు చేయవలసిన కృత్యములు అన్నియు పరిసమాప్తములగును. అనగా ఇక అతడు ఏమియు చేయ వక్కఱలేదు. ఇదియే ప్రత్యక్ష పరమధర్మము. ఇది తప్ప మిగిలిన వన్నియు ఉప ధర్మము లనియే చెప్పబడును. అని భావము.

నీ మిత్రుల విషయమున అమ్మ, నాన్న ఏమి చెప్పినను అది నీ మేలును గోరి చెప్పినదే యగును. ఒకనిని వాని తల్లిదండ్రుల నుండి వేఱు చేసినవాడు మిత్రుడు ఎట్లగును? వానితోడి సాంగత్యము వలన ప్రయోజనము ఏమి? తల్లిదండ్రుల సేవ యన్న పరమకల్యాణ కారణమగు మోక్షమును పొందుటకు పరమోపాయము గదా! నీ మిత్రులు బుద్ధిమంతులే యగుచో అట్టిపనిని మానివేయుమని యేల చెప్పుదురు? ఇట్టి మాటలు వారు నిజముగా నీ మేలును గోరి చెప్పుచున్నారా? అని నీవే ఆలోచించికొని యుండవలయును. అమ్మ, నాన్న ఇప్పుడు మిమ్ము ఎడబాసి మీ గుణములను, మీరు చేసిన సేవలను తలపోసి విలపించుచున్నారు. లోకములో మీరు సుగుణవంతులని, సత్ప్రవర్తనులని మీకు మంచి పేరు ఉన్నది. పెద్ద పెద్దవారు అందఱును మీ మంచితనము చేత ప్రభావితులై యున్నారు. ఇప్పుడు మీరు అమ్మ, నాన్నలను కాదని వేఱుగా ఉండ నారంభించినారని తెలిసినచో మీ యెడల వారి హృదయములలో ఏర్పడిన సదభిప్రాయము నమసిపోకుండునా? వారు మిమ్ము నిందించి అవమానింపకుందురా? నిందలు వచ్చిననాడు మీరు ఎట్లు భరింపగలరు? అమ్మనాన్నల ధనము, సంపద విషయమున మీకు సంకోచము ఎందులకు? హేయ భావము ఎందులకు? మన శరీరములు, అందు ఉన్న సమస్తమును మాతాపితరులు ఇచ్చినవియే కదా! కావున నా అభిప్రాయమును అనుసరించి మీరు వెంటనే పోయి అమ్మానాన్నల పాదముల మీద వ్రాలి వారిని క్షమాభిక్ష కోరుకొనుటయే మంచిది. విలంబము చేయరాదు. మాతాపితరుల లోపము ఏదైన ఉన్నను దానిని మనము పరిగణింపరాదు.

సుశీల యిట్లు పలుకుచుండునంతలో వదిన – సుశీలా! అత్తమామ లను విడచి వేఱుగా ఉండుటలో నాకు మాత్రము ఏ సుఖమును లేదు. ఇష్టమును లేదు. అడుగడుగున నేను మీ అన్నయ్యను

వేడుకొనుచునే ఉన్నాను. కాని యా విధాత నన్ను అత్తమామల సేవకు ఎందుకు దూరము చేయుచున్నాడో ఎఱుగ రాదు అనెను. అప్పుడు రామలాలు మఱల - చెల్లీ! అమ్మ, నాన్న నన్ను తమ దగ్గఱకు రమ్మని పిలువకుండ వారి దగ్గఱకు వెడలినచో వారు నన్ను అవమానింతురేమో? అక్కడకు వెడలుటకు నాకు సిగ్గుఅగుచున్నది. అని పలికెను. అప్పుడు సుశీల - అన్నా! మీరు వచ్చుట వారికి ఇష్టమే. మీరు దగ్గఱలేకపోయిరని వారు ఏడ్చుచున్నారు. అమ్మానాన్నల దగ్గఱకు వెడలుటకు కాని, అక్కడ ఉండుటకు కాని నీకు సిగ్గు ఎందులకు? అందు అవమానము ఏమున్నది? ఒకవేళ వారు ఏమైన అన్నను దానిని గౌరవము కంటె అధికముగ భావించుకొనవలెను. అని మాఱు పలికెను. ఈ విధముగా సుశీల యాడిన హితవచనములను ఆలకించి, సమ్మతించి రామలాలు, అతని భార్య ఇరువురును సుశీలను అనుసరించి తమ తల్లిదండ్రుల దగ్గఱకు తిరిగి వచ్చిరి. ఇరువురు అనాలోచితముగా తాము చేసిన చేతకు చింతించుచు వారి పాదముల మీద వ్రాలి రోదింప మొదలుపెట్టిరి.

అప్పుడు తల్లిదండ్రులు - నాయనా! మీరు మఱల మా దగ్గఱకు

---

★ఒక కవి చెప్పిన మాట -

శ్లో. గీర్భి ర్గురూణాం పరుషాక్షరాభిస్తిరస్కృతా యాంతి నరా మహత్త్వమ్

అలబ్ధశాణోత్కషణా నృపాణాం న జాతు మౌళౌ మణయో వసంతి.

అనగా పెద్దవారి పరుషవాక్యముల చేత పర్యాయముగా అవమానింప బడినప్పుడే (క్రమశిక్షణకొఱకు మందలింపబడుచున్నప్పుడే) మానవులు మహత్త్వమును పొందుదురు. అనగా గొప్పవారు కాగల్గుదురు. ఎట్లనగా మంచి జాతి రత్నములు సైతము వజ్రపు పోగారుంతో అరుగ దీసి సానపెట్టి కాంతివంతములు గావింపబడినప్పుడే మహారాజుల కిరీటములందు అలంకరింపబడును. మహారాజుల చేత గౌరవింపబడును.

మఱలివచ్చుట చేత ఈ దినము మాకు బహు శుభప్రదము, సౌభాగ్యవంతమును అయిన దినమైనది. మాకు చాల సంతోషముగా ఉన్నది అని వారిని ప్రియవచన మాడి గౌరవించిరి. అనంతరము - తల్లీ! సుశీలా! ఈనాడు నీవు మహాకార్యమును చేసితివి. బ్రదికి యున్నంత వఱకు నీ మేలును మఱవము అని సుశీలను కూడ ప్రశంసావచనమాడి ఆదరించిరి. అప్పుడు సుశీల వినయముతో - అమ్మా! అదేమి మాట? ఇందు నా మహత్త్వము ఏమున్నది? మహత్త్వమన్నది ఏమి ఉన్నను అది యంతయు నీది. నాన్నగారిది. అన్నయ్యది. వదినది. కేవలమును నేను నిమిత్తమాత్రురాలను. నాలో ఏ కొంచెమైన మంచితనమన్నది ఉన్నచో అది మీకు నాయందు ఉన్న అనుగ్రహము యొక్క ఫలితమే అని బదులు చెప్పెను.

అభిమాన రహితమైనసుశీలయొక్క ఈ వ్యవహారమును గాంచి అందఱును ముగ్ధులైరి. (డైరీ సంపద - 26. నేను పూజ్యుడను అని తనను తానుఅభిమానించుకొనకుండుట)సుశీల దగ్గర రెండు సమ్మోహన మంత్రములు ఉన్నవి ఒకటి - స్వార్థమును వీడి నిష్కామ భావముతో సర్వవిధముల ఎదుటి వారి హితమును కోరుట, అందులకై ప్రయత్నించుట. రెండు - ఎదుటి వారి అవగుణములను తల పెట్టక శుభగుణములనే ప్రశంసించుట. ఈ మంత్రముల సహాయముతోనే ఆమె తన అన్న హృదయములో పరివర్తనము తీసుకొని రాగలిగెను.

అనంతరము రామలాలు తన మిత్రులను చేరి - మిత్రులారా! అవకాశము చిక్కినప్పుడు నేనే మీ యింటికి వచ్చి మిమ్ము కలిసికొనుచుందును. నా తల్లిదండ్రుల ముందు మిమ్ము ఉచితరీతిని గౌరవింపజాలని దశలో ఉన్నందులకు నన్ను మన్నింపుడు అని ప్రేమ పూర్వకముగను సవినయముగాను వారిని సమాధానపఱచెను.

సుశీల తన పుట్టినింటిలో కొన్ని దినములు మాత్రమే యుండెను. కాని అత్తింటిలో తనపై జరిగిన అత్యాచారమును గూర్చి ప్రసంగించుట కాని అచ్చటి వారిని గూర్చి నిందావచనములాడుట, వారిపై చాడీలు చెప్పుట వంటి పనులు ఎన్నడును చేయలేదు. (దైవీ సంపద - 15. ఎవరిని నిందింపకుండుట, ఎవరిని గూర్చియు చాడీలు చెప్పకుండుట) అమ్మ, నాన్న, అన్న, వదినె ఆమెకు తినుటకు, త్రాగుటకు, కట్టుకొనుటకును సంబంధించు వస్తువులు ఏవేవో తెచ్చి స్వీకరింపుమని ఆమెను బతిమాలిరి. కాని ఆమె ఏదియు స్వీకరింపలేదు. ఎప్పుడైన వారి సంతుష్టిని గోరి ఒకింత స్వీకరించినను ఆసక్తిరహితముగానే స్వీకరించెను. కాని సహజముగా ఆ వస్తువుపై ఆమెకు ఆసక్తికాని, లోలుపత్వము (మిక్కుటమైన ఇచ్ఛ) కాని ఆవంతయును లేదు. ( దైవీ సంపద - 17. విషయములతోడ ఇంద్రియములకు సంపర్కము ఏర్పడినను అందు ఆసక్తుడు కాకుండుట) ఆమె యొక్క వ్యవహారము అంతయు, త్యాగలక్షణ లక్షితమై ప్రశంసనీయముగా ఉండెను.

అనంతరము సుశీలను కొనిపోవుటకు అత్తింటివారు పంపగా ఒక వ్యక్తి వచ్చెను. అప్పుడు ఆమె తన తల్లిదండ్రులతో వినయవచనములాడి ప్రేమ పూర్వకముగా వచ్చుబాటు మాటలు పలికి వియోగ వ్యథను ప్రకటించి వారి యనుమతిని గొని తన కొఱకు వచ్చిన వ్యక్తి వెంట అత్తవారి యింటికి మఱలి వచ్చెను. అట్లు మఱల వచ్చిన సుశీలను గాంచి అత్తింటిలోని వారు అందఱును అమితానందమును పొందిరి.

## (10)

ఇక్కడ సుశీల కుమార్తె ఇంద్రసేని క్రమముగా 12 ఏండ్ల ప్రాయము గలదై వివాహయోగ్యురాలయ్యెను. సుశీల అత్తమామలు ఆమె వివాహమును గూర్చి చింతించుట మొదలుపెట్టిరి. ఒకనాడు వారు

సుశీలను - అమ్మాయీ! మన యింద్రసేని వివాహయోగ్యురాలైనది. నీ మంచితనము కారణముగా ఎందఱో మనతో సంబంధము కలుపుకొను టకు ముందునకు వచ్చుచున్నారు. ఎట్టి వారితోడ బంధుత్వమును కలుపుకొన దగును? ఈ విషయమున నీ యభిప్రాయము ఏమి? అని ప్రశ్నించిరి. ఇందు నా అభిప్రాయముతో పని యేమున్నది? మీరు ఏ సంబంధమును ఇష్టపడిన దానినే అనుసరింతము. అదియే అందఱకును ఆమోదకారణము కాగలదు. వరుడు పేదకుటుంబమువాడై నను చింతింప పనిలేదు. కాని వానియందు బలము, బుద్ధి, విద్య, యోగ్యత, సదాచరణ ప్రవృత్తి, సత్స్వభావము, సచ్చరిత్రత మున్నగు శుభగుణముల సంపద ఉండుట ప్రధానము. పిల్లవాని కుటుంబములోని వారు, ముఖ్యముగా వాని తల్లిదండ్రులు సత్స్వభావము, సదాచరణము కలవారు అగునా? కాదా? అన్న విషయమును పరిశీలింప వలయును అని మీరే కదా చెప్పుచుండువారు. అని సుశీల వారికి బదులు చెప్పెను.

ఇంద్రసేని సుకృతము ఆమె తల్లియొక్క సౌశీల్యమును తోడై సహకరింపగా సుశీల కోరిన విధముగానే మంచి యిల్లును, మంచి కుటుంబము వాడు అగు వరుడును లభించెను. పండిత దామోదర శాస్త్రి కుమారుడగు శివకుమారునకు ఇచ్చి ఇంద్రసేనికి వివాహము జరిపించుటకు నిశ్చయము చేయబడెను. ఆ దామోదర శాస్త్రికి సుశీలయందు గౌరవము ఎక్కువ. ఆ కారణమున వివాహ విషయమున అనుసరింపదగు పద్ధతులను గూర్చి సమాలోచనము చేయుటకై అతడు తన భార్యను ఆమె కడకు పంపెను. తన యింటిలో ప్రవేశించినంతనే సుశీల ఆమెకు విశేషముగా ఆదర సత్కారములు గావించెను. అనంతరము దామోదరశాస్త్రి భార్య సుశీలతో - అమ్మా! మీతోడ సంబంధము ఏర్పడినది. కావున వివాహము ఆదర్శప్రాయముగా జరుగవలెను మీ

యింటిలో కొఱగాని పరిపాటులు, నిరర్థకపు ఖర్చులును ఉండనే ఉండవు. మేము కూడ మా బాగును కోరి ఏమి చేసినను మీ అభిమతమును అనుసరించియే చేయనెంచుచున్నాము అనెను.

ఈ విధముగా కాబోవు వియ్యపురాలు తనమీద విశేషగౌరవమును చూపుచు తన అభిమతము తెలుపుడని కోరగా సుశీల ఇట్లు చెప్పెను – అమ్మా! వివాహసమయమందు మందుగుండు సామగ్రిని కాల్చుట, పేకాట ఆడుట, సినిమా ప్రదర్శనమును ఏర్పఱచుట, విశేషముగా విద్యుద్దీపముల పటాటోపమును ప్రదర్శించుట వంటి ఆర్భాటములకు చోటు ఈయరాదు. అందులకై దుర్వ్యయము ఏదియు చేయరాదు. ఒకరి నొకరు తిట్టుకొనుట, తామస భావాలున్న పాటలు పాడుట, ఎక్కువ వాద్యములను ఏర్పరుచుట మొదలగు చేష్టలకు పాల్పడరాదు. వివాహమన్నది మంచి మంచి విద్వాంసులను రావించి యథావిధిగాను, చక్కగాను జరిపించవలెను. జనసమ్మర్దమును కూడ అధికముగా కల్పింపరాదు. ఇక మేము ఏమి చేయవలెనో మీరు నాకు తెలియజెప్పుడు!

అనగా విని దామోదర శాస్త్రి భార్య – మీకు మేము ఏమి చెప్పగలము? మేము మీరు ఇచ్చు శిక్షణమునే అనుసరింపగోరుచు న్నాము. ఈ విషయమున మీరు ఏమేమి నిర్ణయాలు చేసుకొంటిరో తెలుసుకొందమని మేము ఉవ్విళ్లూరుచున్నాము. కాబట్టి మీకు యుక్తమని తోచినచో మీ ఉద్దేశ్యములను నాకు తెలియజెప్పుడు! అని బదులు పలికెను.

అప్పుడు సుశీల ఇట్లు చెప్పెను. – పరిహాసములు నాట్యములు, పాపపుపాటలు వంటి వానిని మేము ఏనాటినుండియో బహిష్కరించుకొ న్నాము. చుట్ట, బీడి, సిగరెట్టు, భంగు, గంజాయి, నల్లమందు మొదలగు మాదక ద్రవ్యములతోడను, ఐసుసోడా, డ్రింకులు, హోటలువారిచేత

ఏర్పరింపబడిన భోజనవ్యవస్థ, పార్టీలు, సెంట్లు మున్నగువానితో సత్కారములు చేయుట శాస్త్రవిరుద్ధము అగుటయే కాదు. వానితో సత్కరించుట యన్నది సత్కారము అను పేరుతో వచ్చిన వారిని అవమానించుటయే యగును. శాస్త్రానుసారముగా చేతులకు పసుపు, రాయు ప్రక్రియ తరువాత యథావిధిగా దేవతాపూజనము గావించి మంచి మంచి విద్వాంసుల పర్యవేక్షణమునందు చక్కగా కన్యాదానము చేయనెంచుకొని యున్నాము. మీకు, మీ పక్షము వారికి అచ్చమైన సత్కారము అన్నది మేము మీ యెడల చూపు శ్రద్ధ, ప్రేమ, సద్వ్యవహారమువలననే సంభవమగును. ఆ లక్షణములు మాలో కొఱవడి యున్నవి. అనుకొనుడు! భోజనాలు, వక్క, ఆకు, లవంగము, ఏలకులు మున్నగువాని యేర్పాటు సాధారణస్థాయిలోనే చేయుటకు నిశ్చయించికొన్నాము. కట్నములుగా కానుకలుగా అర్పించుటకు మా దగ్గఱ ధనము ఏమున్నది? మాయ, మర్మము, కల్ల, కపటము ఎఱుగని పిల్లను మాత్రమే మీ సేవకు అప్పగించి మమ్ము మేము పవిత్రులను గావించుకొన నెంచుచున్నాము. మేము మహాభాగ్యశాలులము. కావుననే మీ వంటి సరళస్వభావులు, త్యాగశీలురును అగు వారితోడ మాకు బంధుత్వము ఏర్పడుట సంభవించినది. మీ వ్యవహారమును గాంచి మేము ఎంతయో ముగ్ధులము అగుచున్నాము. ఈ మాటలు విని దామోదర శాస్త్రి భార్యయు సంతోషమును ప్రకటించెను.

అనంతరము నిర్ణీతదినమున ఇరు పక్షముల వారును ఒకరిపై ఒకరు శ్రద్ధ, వినయము, అనురాగమును ప్రదర్శించుకొనుచు ఒకరియెడల ఒకరు మంచితనముతో వ్యవహరించుచు ఉండగా పైని చెప్పిన విధముగా ఎంతయో ప్రశంసనీయముగాను, సాత్త్వికముగాను, పరమాదర్శప్రాయము గాను వివాహకార్యము సంపన్నమయ్యెను.పరస్పర నమస్కారములు ముగిసిన తరువాత సాదరముగా పెండ్లివారికి వీడ్కోలు చెప్పబడినది.

సోమదత్తుడు, రామదత్తుడు, మోహనలాలు - ముప్పురు సోదరులును సుశీల స్థాపించిన వ్యాపారమును తమ సొంత పర్యవేక్షణములో ముందునకు సాగించుచుండిరి. ఇంటిలోని ఆడ వారి నడుమ వ్యవహారము సుశీలయొక్క సంపర్కము కారణముగా సుందరమైనదిగా పరిణతమయ్యెను. ఈ విధముగా మఱికొంత కాలము గడచునప్పటికి ఇంద్రసేనుడు 16 ఏండ్లప్రాయమువాడై వివాహయోగ్యుడు అయ్యెను. అప్పుడు అతనికి పండిత రఘునాథాచార్యుని కొమరిత యగు గాయత్రితోడ సలక్షణముగా వివాహము సంపన్నము చేయబడెను. ఆ వివాహముకూడ యథాపూర్వకముగా సాత్త్వికముగాను, ప్రశంసనీయముగాను, ఆదర్శప్రాయముగాను జరిగెను. అందు కూడ నాట్యగానములు, నిరర్థకపు పరిపాటులు, అనావశ్యకపు దుర్వ్యయముతో కూడిన ఆడంబరపు పనులు ఏవియును పాటింపబడలేదు. వీరి పక్షమున వ్యవహారము త్యాగమయముగానే సాగెను. కాని రఘునాథాచార్యుడు విశేషముగా బతిమాలిన కారణమున వారి సంతుష్టిని కోరి ఒకింత నామ మాత్రపు కట్నమును స్వీకరింపవలసి వచ్చెను.

ఈ విధముగా ఆడుబిడ్డకు, మగ పిల్లవానికి వివాహ కార్యములు ముగిసిన పిమ్మట ఇంటిలోని వారు అందఱును ఒండొరులతో ఎంతో ప్రేమ పూర్వకముగాను, త్యాగమయముగాను వ్యవహరించుకొనుచు, హాయిగాను, నిశ్చింతముగాను కాలము బుచ్చుచుండిరి.

## (11)

కొంతకాలమునకు దేవదత్త పండితునకు ఉబ్బసపు జబ్బు ప్రబలమై శరీరము బలహీనమై తఱచుగా జ్వరము వచ్చుట మొదలయ్యెను. ఎన్నో ఆయుర్వేదపు మందులు సేవింపబడినవి. కాని ప్రయోజనము లేకపోయెను. రేయనక, పగలనక సుశీల సవినయముగాను, ప్రేమ

పూర్వకముగాను అందించిన సేవలతో దేవదత్తుడు ముగ్ధుడయ్యెను. అప్పుడు అతడు ఆమెతో – తల్లిగా! నీవు సర్వవిధముల నిర్దోషురాలవ మ్మా! ఇట్టి సచ్చరిత్రురాలవైన నిన్ను ఇంటిలోనుండి వెడలగొట్టితి గదా? అన్న బాధ నామనమును ములికి వలె కెలుకుచున్నదమ్మా! అని విలపించెను. అంతట సుశీల తన యాడ పడుచు అగు రోహిణిచే ఇట్లు చెప్పించెను. – మామయ్యా! అందు మీ తప్పు ఆవంతయున లేదు. ఆ సంఘటనము మోసముతో జరిగినది. దానిని గూర్చి మీర ఇంచుకంతయు విచారింప పనిలేదు. మిమ్ము విడచి మీకు దూరముగ ఉండవలసి వచ్చినందులకు నేనే చింతించితిని. అది నా దురదృష్టముగ భావించుకొంటిని. ఇటుపైని ఆ విషయమును ఎంచి మీరు వ్యసనపడుచు ఉన్నచో నాకు చిత్తశాంతి కరవైపోవును. అనగా విని దేవదత్తుడు – అమ్మా నీవు విచారింపవలదు. ఇప్పుడు నీ మాటలు విన్నమీదట నా మనస్సు కుదుట బడినది. అని బదులు పలికెను.

అనంతరము దేవదత్తపండితుని పరిస్థితి నానాటికి క్రమముగ క్షీణించి అవసానకాలము సమీపించెను. ఆ పరిస్థితిని పరికించి యింటిలో వారు ఒక స్థానమును చక్కగా తుడిచి శుభ్రపఱచిరి. దాని గోమయముతోడను, పవిత్రజలముతోడను అలికి నాలుగు దిక్కు యందును గంగాజలమును చల్లిరి. దానిపై తిలలను, ఆవగింజలన చల్లి భగవన్నామమును లిఖించిరి. దానిమీద పవిత్రమైన యిసుకత పాన్పును రచించి దానిమీద గంగానదికి సంబంధించిన ఇసుకరేణువులన చల్లిరి, దానిమీద దర్భలను పఱచి చేతితో తయారు చేయబడి శుభ్రవస్త్రమును పఱచిరి. అనంతరము పండిత దేవదత్తుని సంకేతమున అందుకొని సోమదత్తుడు ఆయనకు పవిత్రజలముతో స్నానము చేయిం పరిశుద్ధమైన ఉత్తరీయమును, అధోవస్త్రమును ధరింపజేసి యజ్ఞోపవీ మును మార్చెను. అనంతరము ఆయనను ఆ యిసుక పాన్పుమీ

పరుండబెట్టి చేతితో తయారు చేయబడిన తెల్లని వినూత్న శుద్ధ వస్త్రమును ఆయన దేహము మీద కప్పెను. ఆయనకు చేరువగా ఒక తులసి మొక్క కుండిని నిలిపెను. ఆయన మస్తకము మీద చందనపు తిలకమును దిద్ది మెడలో తులసి పూసల పేరును ధరింపజేసెను. ఒక చిన్న భగవద్గీతాగ్రంథమును ఆయన తలక్రింద ఉంచెను. ఆ పండితుడు మహావిష్ణుస్వరూపమును ఉపాసించినవాడు. ఆ కారణమున ఆయన వక్షస్థలము మీద ఒక చిన్న సాలగ్రమమూర్తిని నిలిపెను. అనంతరము ఫల పత్ర పుష్ప ధూప దీపాదులగు షోడశోపచారములతోడ భగవత్పూజనము గావించెను. హారతిని అర్పించెను. అటు పిమ్మట సోమదత్తుడు తండ్రిచేత తులసి తీర్థమును, గంగా జలమును త్రాగించెను. భగవద్గీతలోని 8వ అధ్యాయమును అర్థయుక్తముగా చదివి వినిపించెను. అటు మీదట శ్రద్ధా భక్తులతో అందఱును గూడి తాళములను గ్రహించి ఏక కంఠముతో హరినామ సంకీర్తనము చేయ మొదలుపెట్టిరి. పండితుని కంటికి కనపడు విధముగా ఎదురుగా గోడమీద శ్రీ మహావిష్ణువు ఫొటోను ఒకదానిని వ్రేలగట్టిరి. దానిని చూచుచు భగవానుని నామ, రూప, గుణ, ప్రభావాదులను స్మరించుచు, భగవన్నామ కీర్తనమును ఆలకించుచు కడకు దేవదత్తపండితుడు దేహత్యాగము చేసి భగవానుని పరమధామమునకు వెడలిపోయెను.

ఈ కథను చదివి ముఖ్యముగా తల్లులు, సోదరీమణులు ఉత్తమశిక్షణమును పొందవలెను. వారు సుశీలను ఆదర్శముగా గ్రహించి ఆమె వలె మెలగుటను అలవరచుకొనవలెను. అనగా తమకు అపకారము చేసిన వారికి కూడ ఉపకారము చేయుచుండవలెను. బాలురయందు వాత్సల్యమును, సమవయస్కులయందు మైత్రీ లక్షణమును ప్రదర్శింపవలెను. శ్రద్ధాభక్తులతోడను వినయపూర్వకముగాను పెద్దవారికి సేవ చేయవలెను. నిస్స్వార్థభావముతో మంచి పనులు చేయుచుండవలెను. పేరు ప్రతిష్ఠలను కోరరాదు. వచ్చిన పేరు ప్రతిష్ఠలకు తాము కర్తలము అవి అనుకొనక పరులయందే కర్తృత్వమును నిలుపుచుండవలెను. సర్వదా

సత్యసంరక్షణమునకు పాటు పడవలెను. ఎంత భయంకరమైన ఆపదలు సంభవించినను కామ క్రోధ, లోభ, లజ్జాదులగు అవలక్షణములకు లోబడరాదు. ధైర్యమును, ధర్మమును భగవద్భక్తిని విడువరాదు. కడకు ప్రాణపరిత్యాగమునకు కూడ పాల్పడరాదు. అత్తమామలు, తల్లిదండ్రులు, భర్త మున్నగు పెద్దవారికి శారీరకముగాను, మానసికముగాను ప్రతిఫలాపేక్షా రహితముగాను సేవలు చేయుచుండవలెను. పిల్లలకు మీరు స్వయముగా మంచి పనులు చేసియు, మంచి మాటలు బోధించియు ఉత్తమ శిక్షణమును అందింపవలెను. పిల్లల వివాహాది శుభకార్యముల సందర్భములందు నిరర్థకపు పరిపాటులను, దుర్వ్యయపూర్వకములగు ఆడంబరములను పరిహరింపవలెను. దొంగలు, దుండగులు, వంచకులు, నీచులు, ధూర్తులు మున్నగు దుర్మార్గుల నుండి వివేకముతోను బుద్ధికుశలతతోను, చతురతతోడను తప్పించుకొనుటకు ప్రయత్నించుచు ఉండవలెను. వ్యాధిగ్రస్తులు, మృత్యుగ్రస్తులు, ఆపద్గ్రస్తులును అగువారికి నిస్స్వార్థభావముతో సేవలు చేయవలెను. విద్య, బుద్ధి, బలము, తేజస్సు, శిల్పకళాపరిజ్ఞానము మున్నగువానిని పెంపొందించుకొనుటకు నిరంతర మును కృషి చేయుచుండవలెను. ఎల్లవారిని తనకు అనుకూలురను గావించుకొనుటకై వారిలోని అవ గుణములను పరిగణింపక శుభగుణము లనే ప్రశంసించుచు వారికి పరమహితము గలిగించుటకు ప్రయత్నము చేయుచు ఉండవలెను. క్షమ, (సహనము) దయ, శాంతి, సమబుద్ధి, సంతోషము, సరళస్వభావము, శ్రద్ధ, భక్తి ప్రేమ మున్నగు శుభగుణములను, సత్సంగము, స్వాధ్యాయము (సద్గ్రంథపఠనము) భగవత్కథాసంకీర్తనము, తీర్థము, (పుణ్యనదీస్నానము) సేవ, తపస్సు, దానము మున్నగు సదాచార విధులను అమృతతుల్యములైనవని యెఱిగి కర్తవ్యబుద్ధితో, నిష్కామభావముతో శ్రద్ధాభక్తిపురస్సరముగా ధారణము చేయవలెను.

సమాప్తము



# భగవానుని అవ్యాజ సుహృద్భావము

## అను పుస్తకము నుండి

భగవానుడు దయామయుడు. దయ వహించియే అతడు అందరినీ ఉద్ధరిస్తూ ఉంటాడు. అతడు గొప్ప ప్రేమలక్షణం కలవాడు. భగవద్గీతలో అతడు తనను గూర్చి స్వయంగా-
'సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి' **(5-29)** అని చెప్పియున్నాడు. అనగా ఎవడు నన్ను సమస్తప్రాణుల యందు సుహృద్భావం కలవానిగా గుర్తిస్తాడో ఆ సాధకుడు శాంతిని పొందు తాడు అని భావం.

మేము భగవానుని పరమదయాళుడని, విశేష ప్రేమలక్షణం కలవాడని, అవ్యాజంగా దయ చూపేవాడని భావిస్తున్నామని మీరంటే భావించడం లేదు. కేవలం నోటిమాటగా చెప్పుతున్నారు. ఆ భావన హృదయపూర్వకం కావాలని నేనంటాను. పరమప్రేమ లక్షణం కలవానిగా హృదయపూర్వకంగా మనం భగవానుని ఎప్పుడు గుర్తిస్తామో, అప్పుడు ఆ స్వామిని విడిచి మఱియొకనిని ప్రేమించనే ప్రేమించము. భగవానుడు తన్ను ప్రేమించే వారికి అధీనుడుగా అమ్ముడైపోతాడు. భగవానుని హార్ధికంగా ప్రేమించేవాడు ఆ స్వామిని కొననూగలడు. అమ్మివేయనూ గలడు. ప్రేమ భక్తి మార్గాన్ని అవలంబించిన వారికి ఆ స్వామి యొక్క దర్శన భాగ్యం కలగడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

'హరిబ్యాపక సమానా, ప్రేమతే ప్రగటు హోహిమై జానా' (తులసీదాసు)
అనగా హరి సర్వత్రా వ్యాపించి ఉంటాడు. ఉంటే అక్కడ ప్రకటం

అవుతూ ఉంటాడు అని భావం. అయితే ఆ స్వామి తనను ప్రేమించిన వానికి దర్శనం మాత్రం ఇచ్చి ఊరకుంటాడని అనుకో రాదు. అతనికి వశవర్తి కూడ అవుతాడు. అందుకు ప్రమాణంగా 'అహం భక్తపరాధీనః' అని ఆస్వామి చెప్పే ఉన్నాడు. అంటే నేను భక్తుని వశంలో ఉంటాను అని భావం - అంతే కాదు, భక్తుడు ముందు ముందు నడుస్తూ ఉంటే ఆ స్వామి భృత్యుని వలె వాని వెనుక నడుస్తూ ఉంటాడు. ఆ భక్తుని పాదధూళి తనమీద పడాలని దానివల్ల తనకే పవిత్రత వస్తుందని భావిస్తూ ఉంటాడు. ఇందుకు ప్రమాణం ఏది? అంటారేమో? ఇదిగో ఆ స్వామి చెప్పిన మాట.

'అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రిరేణుభిః'

అనగా భక్తుని పాదధూళి సోకితే నేను పవిత్రుడను అవుతాను అన్న భావంతో అతనిని నేను అనుగమిస్తాను అని భావం.

కారణం ఏమంటే భక్తునికి అట్టి సదవకాశం ఉంది. ఇందుకు ప్రమాణం-

'యే యథా మాంప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్'.

అన్నమాట. అంటే ఎవరు నన్ను ఏవిధంగా సేవిస్తే వారిని నేను కూడ ఆ విధంగానే భజిస్తాను అనిభావం.

అంతేకాదు, ఏ భక్తుడైన తన్ను ఎవరికైన అమ్మివేస్తే అనగా అర్పించివేస్తే భగవానుడు ఏమంటాడో ఎఱుగుదురా? అవును! నా భక్తుడు నన్ను ఇచ్చి వేయగలడు అమ్మి వేయగలడు అనియే అంటాడు. అట్టి ఉదాహరణ గాథలు కూడా ఉన్నాయి. నరసీమోహతా ( ఒక భక్తుడు) విషయంలో భగవానుడు ఏమన్నాడు? 'బేచే తో బిక్ జాఊఁ, నరసీ మ్హారో సిర ధనీ' అన్నాడు. అంటే నరసీమెహతా నా ప్రభువు. అతడు నన్ను అమ్మి వేస్తే అమ్ముడై పోతాను అని భావం.

నరసీమెహతా ఒకసారి శ్యామల్‌షా అనే పేరుతో భగవానుని పేర రు. **750/-** లకు ఒక చెక్కు వ్రాసి ద్వారకకు పోవుచున్న వారికి ఇచ్చేడు. వాళ్ళు ఆ చెక్కును తీసుకుని ద్వారకకు వెళ్ళి అక్కడ శ్యామల్‌షాను వెదకి పట్టుకొని ఆ చెక్కును అతడికి చూపి అతడి దగ్గర డబ్బు తీసుకోవలసివుంది అన్నమాట! ద్వారకలో 'నరసీమెహతాకు పెద్ద దుకాణం ఏదో ఉంది. శ్యామల్‌షా అనేవాడు అందులో ఉండే గుమస్తా' అని వాళ్ళు అనుకున్నారు. నరసీమెహతా మహాభక్తుడు. శ్యామసుందరుని (శ్రీకృష్ణుడు) పేరే శ్యామల్‌షాగా ఒకగొప్ప సేటుగారి పేరు లాగ అతడు మార్చి వ్రాసేడని పాపం! వాళ్ళు ఏ మెఱుగుదురు? ఆ చెక్కును తీసుకొని వాళ్ళు ద్వారకకు వెళ్ళేరు. అక్కడ శ్యామల్‌షా కోసం విచారణ చేసేరు. అతడు దొరక లేదు. మీ దగ్గర చిరునామా ఏదీ లేదా? అని అచ్చటి వాళ్ళు వీరిని అడిగేరు. ద్వారకాధీశుని ఆలయము దగ్గర ఉండే శ్యామలషా అని వీరు సమాధానం చెప్పేరు. ఇక్కడ ఆ పేరుగలవాడు ఎవ్వడూ లేడు. అతని దుకాణమూ లేదు. మిమ్మల్ని ఎవరో మోసం చేసేరయ్యా! అని అక్కడి వాళ్ళు బదులు చెప్పేరు. అప్పుడు చెక్కు తెచ్చుకున్న వాళ్ళు పశ్చాత్తాపంతో తిరుగుముఖం పట్టి పోయి నరసీ మెహతాను బాగా అవమానించాలని నిశ్చయించుకున్నారు. అప్పటికి చీకటిపడి రాత్రి సమయం అయింది. అప్పుడు ప్రయాణం అను కూలం కాక వాళ్ళు ద్వారకా ధీశుని (శ్రీకృష్ణ పరమాత్మ) ఆలయం ప్రక్క పరున్నారు. చాల దుఃఖదశలో ఉండడం చేత వాళ్ళకు నిద్ర పట్టడం లేదు. ఊరకే మెలకువగానే పరున్నారు. అంతలో మాఱువేషంలో భగవానుడు వాళ్ళ దగ్గరకు వచ్చి - అయ్యలారా! ఇక్కడ ఎవరి దగ్గరైన నా పేర వ్రాయబడిన రు.**750/-** ల చెక్కు ఉందా? నేను ఆ చెక్కు తెచ్చిన వారికోసం ఎదురు చూస్తూ

ఉన్నాను. అని ప్రశ్నించేడు ఆ! ఆ! ఆ చెక్కు మాదగ్గరే ఉంది. మేము తెచ్చేము. మీరున్న చోటు తెలియక ఇక్కడ పడి ఉన్నామని వీళ్ళు బదులు చెప్పేరు. అప్పుడు గుమాస్తా వలె ఉన్న భగవానుడు - బాబూ! ఇవిగో రు. 750/- లు తీసుకోండి! ఆ చెక్కు నాకు ఇచ్చేయండి అంటూ డబ్బు ఇచ్చి చెక్కు తీసుకున్నాడు. తరువాత అతడు చెక్కు తెచ్చినవాళ్ళతో - బాబూ ! మీతో నాది ఒక్క మనవి. సేటు నరసీమెహతా దగ్గఱకు వెళ్ళినప్పుడు మీరు బాబ్బాబూ! నన్ను గూర్చి చెడ్డగా చెప్పకండేమి? మీరే నన్ను మన్నించి నా తప్పు కాయాలి. నావల్ల చాలా పొరపాటు అయింది. పాపం! మీరు నా కోసం వెదుక్కుంటూ ఉండిపోయేరు. ఇంతలో చీకటిపడి పోయింది. నేను మిమ్మల్ని కలియలేకపోయేను. మీరు నాకోసం వెదకుతూ ఉన్నట్లు ఎవరో నాతో చెప్పారు. విని పరిగెత్తు కొని వచ్చాను. కాబట్టి మా అయ్యగారి దగ్గర నేను అపరాధం చేసినట్లు చెప్పకండేమి? నన్ను క్షమించండి! అంటూ సవినయంగా క్షమాభిక్ష కోరుకుని వెడలి పోయేడు. ఔర! ఈ గుమస్తాఎంత మంచివాడు? మనం ఇక్కడనుండి వెళ్ళిపోయిఉంటే నరసీమెహతాను ఎన్నో తిట్లు తిట్టి ఎంతగానో అవమానించి ఉండేవాళ్ళం గదా! ఇతడు ఎవడో మనం ఉన్న చోటుకే వచ్చి డబ్బు ఇచ్చిపోయేడు. అని వాళ్ళు తమలో తాము అనుకొని ఎంతో సంతోషపడ్డారు.

అనంతరం వాళ్ళు మళ్లీ రెండవసారి నరసీ దగ్గరకు వెళ్ళి తమకు మళ్ళీ చెక్కు వ్రాసి ఇమ్మని కోరేరు, ఎవరి పేరట? అన్నాడు నరసీ. శ్యామల్‌షా పేరటనే అన్నారు వాళ్ళు. అంతే కాదు. వాళ్ళు ఇంకా ఇలా అన్నారు - మీ గుమస్తా ఎంత ఉత్తముడు అండీ? మా చెక్కుకు చెల్లుబడిగా డబ్బును మేము ఉన్న చోటుకే తెచ్చి ఇచ్చి

వెళ్ళేడు. తాను ఏ అపరాధం చేయకపోయినా తన అపరాధం మన్నించమంటూ ఎంతో వినయంగా మాటలాడేడు. అతని యింటి దగ్గర అతడు మాకు దొరకలేదు. అతడే మమ్మల్ని వెదక్కుంటూ మేము ఉన్న చోటుకి వచ్చేడు. అంతమంచి గుమస్తాను ఎక్కడా మేం చూడలేదు. ఆహా! మనిషి అంటే అతడే మనిషి. ఒకటో నెంబరు వాడు. ఈ మాటలు విని నరసీ ఇలా అన్నాడు. మీరు బహు పుణ్యాత్ములు, ధన్యాత్ములూను, అయ్యా! ఆ వచ్చిన వాడు సాక్షాత్తు ద్వారకాధీశభగవానుడయ్యా! నేను మీకు చేతులు జోడించి నమస్కారిస్తూ ఉన్నాను. మీకు భగవత్సాక్షాత్కారము అయింది. మాకు అక్కడ దుకాణమూ ఏదీ లేదు. గుమస్తా ఎవ్వడూ లేడు. మీరు చెక్కో! చెక్కో అని నన్ను వేధిస్తూ ఉంటే మిమ్మల్ని వదలించుకోవడానికి నేను మీకు శ్యామల్‌షా అనే పేరుతో భగవానుని పేర చెక్కు వ్రాసి ఇచ్చేను. ఆ చెక్కు చెల్లుబడి అయింది అంటే అది మీ మహాభాగ్యం. ఈ మాటలు విని వాళ్ళు ఎంతో పశ్చాత్తాప పడ్డారు. మళ్లీ ద్వారకకు వెళ్లి ఆవ్యక్తికోసం వెదికేరు. కాని ఇప్పుడు అతడు వీరికి ఎక్కడ దొరుకుతాడు? చూచేరు కదా! నరసీమెహతా చర్యను? ఇది ఒక విధంగా భగవానుణ్ణి అమ్మడం కదా? భగవానుని పేర చెక్కు వ్రాసి ఇవ్వడం అతడిని అమ్మడం వంటి చర్యే 'యిది. అయితే ఇందులో మరొక్క విశేషం ఉంది. అదేమంటే భక్తుడు ఇతరులకు కూడ భగవద్దర్శనం చేయించగలడు అనేది. ఇట్టి భక్తుడికిస్వయంగా భగవద్దర్శనం ప్రాప్తించడంలో ఆశ్చర్యం ఏముంటుంది?

భగవానుని ప్రేమ విషయం చాలా లోతైనది. అది యిట్టిది అని చెప్పడానికి వాక్కుకు శక్తి లేదు. ఇలాంటిది అని ఊహించి వాక్కు ద్వారా దృష్టాంతాలను ప్రతిపాదించడానికి మనస్సుకి

సామర్థ్యం లేదు. ఇదమిత్థం అని నిర్ధారించడానికి బుద్ధికి పట్టు దొరకదు. అసంఖ్యబ్రహ్మాండాలకు అధిపతియైన భగవానుని మనవంటి అల్పప్రాణులతో సుహృద్భావమా? ఆ స్వామికి మన తోటి సమానత్వమా? అనే విషయాన్ని మనం విచారణ చేసి అర్థం చేసుకోవాలి. అయితే ఒక్క ఐశ్వర్యం అనే అంశాన్ని దృష్టిలో పెట్టుకొని ఆ స్వామి ప్రభావాన్ని అంచనా కట్టడమా? అన్నది నా ప్రశ్న. నేను ఇక్కడ భగవానుణ్ణి ఏమన్నాను? అసంఖ్య బ్రహ్మాండాధి పతి అని కదా అన్నాను! ఈ మాట ఆస్వామి ప్రభావాన్ని పూర్తిగా వ్యక్తం చేయగల మాటయా? కాదు. బాగా నిమ్నస్థాయికి చెందిన మాట. అన్నన్నా! ఏమి? అసంఖ్యబ్రహ్మాండాధిపతి బహునిమ్న స్థాయివాడా? అని ప్రశ్నించవచ్చును. కాని ఇది ఐశ్వర్యాపేక్ష కలవారికోసం చెప్పిన మాట. భగవానుని ఐశ్వర్యమయరూపం మాత్రమే ఇందులో వ్యక్తం చేయడం జరిగింది. ఒకటా? రెండా? మూడా? ఇరువదా? లక్ష. లక్షబ్రహ్మాండాలకు అధిపతి ఆస్వామి. ఇలా మనం ఆ స్వామిని భావనం చేస్తే కోరిన వారికి ఆ ప్రభువు ఒకటి రెండు బ్రహ్మాండాలు మాత్రం ఇవ్వగలడన్న భావమే వస్తుంది. అంటే మనం భగవానుని ప్రభావాన్ని బ్రహ్మాండాల ఐశ్వర్యంతో కొలత వేస్తున్నా మన్నమాట! ఈ విధంగా ఆ స్వామి ఐశ్వర్యవంతుడు మాత్రమే అయ్యేడు. వేలాది గ్రామాలకు ఒక ఏలిక అన్నట్లు వేలాది బ్రహ్మాండాలకు ఆయన ప్రభువు. ఏలిక సంతోషిస్తే ఒకటి రెండు గ్రామాలు ఇస్తాడు. భగవానుడు ప్రసన్నత చెందితే మానవుణ్ణి ఒకటి రెండు బ్రహ్మాండాల ఐశ్వర్యానికి అధిపతినో లేక బ్రహ్మనో చేస్తాడన్న మాట! భగవానుని మహత్త్వం విషయంలో మన భావాలు ఇలా బహుసంకుచితంగా ఉన్నాయి.

భగవానుడు ఐశ్వర్యమయుడు మాత్రమే కాదు. అతడు

ప్రేమమయుడు ఆనందమయుడు. చిన్మయుడు జ్ఞానమయుడు కూడ. కాని ఈ అంశాలను మనం తలపులోకి అయినా తెచ్చుకోవడం లేదు. నా ఆత్మ అల్ప జ్ఞానం కలది. పరమాత్మ సర్వజ్ఞానం కలవాడు. నేను ఘటాకాశం వంటివాడను. పరమాత్మ మహాకాశంవంటివాడు. అని అనుకోండి! ఇక్కడ భగవానుని ఔదార్యం ఎలా ఉందో చూచేరా? ఘటాకాశంలాగా ఉన్న జీవుడు పరమాత్మని శరణు పొందితే మహాకాశస్థానంలో ఉండే ఆ పరమాత్మ ఆ జీవుని చేతిలో ఆత్మసమర్పణ చేసుకుంటున్నాడు.

సారాశం ఏమంటే ఎవడైతే భగవానుని ముందు తన్ను తాను ఆత్మసమర్పణ చేసుకుంటాడో వాని ముందు భగవానుడు కూడ తన్ను తాను అర్పించుకుంటాడు. అన్నమాట! చూచేరా? ఆస్వామి ఎంత పరమౌదార్యం కలవాడో? నిజం ఆలోచిస్తే ఆ స్వామిముందు మన స్థాయి ఎంత? మనం ఏ పరిగణనలోనికి వస్తాము? మనం బహు అల్పజ్ఞులం. బహు కొంచెపువాళ్ళం. పరమాత్మయో? అవధులు లేనంత మహత్త్వం కలవాడు. నాయనలారా! మీదృష్టిని ఆయన మహత్త్వం మీద నిలపండి! ఆ స్వామి మహాజ్ఞాన స్వరూపుడు. చేతన స్వరూపుడు. ఆ సర్వజ్ఞుడైన పరమాత్మ తన సర్వజ్ఞత్వాన్ని తన్ను శరణుపొందిన అల్పజ్ఞులకు అర్పించి వేస్తున్నాడు. మనం మన అల్పజ్ఞత్వాన్ని ఆసర్వజ్ఞునకు అర్పిస్తున్నాము కాబట్టి నాయనలారా! మీరు ఆస్వామి యొక్క సర్వజ్ఞత్వాన్ని గుర్తించండి మీ అల్పజ్ఞత్వాన్ని గుర్తించు కొండి! అట్లు చేస్తే మీరు భగవానుని ప్రభావాన్ని జ్ఞానం దృష్టితో కొలచినట్లు అవుతుంది. సర్వజ్ఞత్వం దృష్టితో తూచినట్లూ అవుతుంది. ఆస్వామి మహత్త్వానికి ఐశ్వర్యం కొలబద్ద కానేకాదు. ఐశ్వర్యం నశ్వరం అయినది. అది మిథ్యా పదార్థం. దానిన కొలబద్దగా చేసుకొని మీరు ఆ స్వామి ప్రభావాన్ని కొలవడం

ప్రారంభిస్తే మీరు ఆస్వామిని సరిగా అర్థం చేసుకున్న వ
కానేకారు.

ఈ విధమైన పరిజ్ఞానాన్ని పొందిన వాడు మానవ భగావానుని విడిచి మఱియొకరిని ప్రేమించనే ప్రేమించడు. అ ఐశ్వర్యాన్ని చూచి మోహాన్ని పొందడు. ఇదంతామాయ మి స్వప్నతుల్యం అనే అవగాహన వాడికి కలుగుతుంది. త ప్రేమించేవాని చేతిలో తాను అమ్ముడు పోయేటంత పరమో ప్రేమలక్షణం కలవాడు పరమాత్మ. అతడు ఈయలేనిది ఏమీ లే తనను ప్రేమించే వానికి తనను తాను అర్పించుకుంటాడు. వ్యక్తి తనను ప్రేమిస్తూ ఉన్నందులకు బదులుగా పరమాత్మ వానికి అర్పించుకుంటున్నాడు అంటే అది ఎంతటి పరాకా చేరిన ప్రేమ? ఎంత అవధులు మీఱిన ఔదార్యం?

